# సాహితి

తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి సంపాదించినది

మొదటి వర్షము



ఆఱవ సంచిక

సాహితీ సమితి

తెనాలి :: ౧౯౨౦

చందా రూపాయిన్నర

సంచిక పావలా

# విషయసూచిక

మొదటిసంవత్సరము: ఆఱవసంచిక



---

'సాహితి' సంవత్సరమునకు ఆఱుసంచికలు.

సంవత్సరపుచందా పోష్టేజీతో రూపాయిన్నర.

ఇందలి కథలలో పాత్రములు కేవల కల్పితములు.

కథలు, వ్యాసములు, పద్యములు సంపాదకుని పేర పంపవచ్చును.

చిరునామా మారినప్పుడు చందాదారులు మాకు తెలుపవలెను.

---

# బహుమానములు

ప్రతిఋతువుస నొక్కొక బహుమానము 'సాహితి' చదువువారి కిచ్చుచుందుము. విశేషములు ఆయాసంచికలో చూడవచ్చును. ఏవోతుచ్ఛవస్తువులుగాక ద్రవ్యరూపమైన బహుమానములే యిత్తుము.

---

# ఏజంట్లు కావలెను

'సాహితి' కి చందాదారులను చేర్చుటకు ఏజంట్లు కావలెను.
విశేషములు తెలిసికొనుటకై క్రిందిచిరునామాకు వ్రాయవలెను.

సభాపతి, సాహితీసమితి, తెనాలి




# పోయిన నగ

కా. వెంకటసుబ్బయ్య

౧

"అయ్యో, బావా, గులాబిపువ్వెవరో కోసుకువెళ్ళారు!" అని కమల ఆకస్మికముగా పలికెను. రామారావు సంపెగ పొదలో మాటి ఆకులలో దాగి పరిమళించుచున్న పూవుల కయి వెదకుచుండెను. అతడామె మాటవినగానే పొదనుండి చప్పున వచ్చి ఆమెయొద్దకేగెను. పోరగా పోరగా వాళ్ళబాబు అంటు తెచ్చి వేసినాడు. చేతులు కాయలు గాయునట్లు తాను నీళ్ళుపోసి పెంచినది. ఎప్పుడు మొగ్గతొడుగునాయని ప్రతిదినము చిగుళ్ళన్నిటి విప్పిచూచుచుండెడిది. ఇదే మొదటిపువ్వు, ఇదే దొంగలు అపహరించినారు.

"నిన్న సాయంకాలము చూశానే!" అని అతడు కొంత ఆశ్చర్యముతో బలికెను.

"నేనూ చూశాను. చక్కగా నా చేతి మీదిగా కోసుకుందామనుకున్నా ఎవళ్ళ మొహానో పెట్టుకున్నారు!,, రామారావు కొంచెము మందహాసము చేసెను. అది చూచి కమల ముఖము వికసింప, "ఆ నువ్వే కోశావు, ఎక్కడ దాచావో చెప్పు,, అని అతని చొక్కా పట్టి లాగసాగినది. అతడామెచేతిని తన రెండు చేతులతో బట్టుకొని వత్తుచు, "ఎందుకూ, నవ్వుతున్నాననా? నేను కోయలేదు. కోస్తే కోశానని చెప్పనా!,, అని పలికెను.

కమల మొగము చిన్నబోయెను. తన చేయి మెల్లగా వదల్చుకుని ఆమె గులాబి తొడిమెను స్పృశించుచు కన్నులనీరు గార్చజొచ్చెను.

వారిద్దరను ప్రేమ వల్లిక అతి దృఢముగా పెనవైచినది. మొదట మొదట కమల బావయొడిలో గూర్చుని మాటలు చెప్పుచుండేదే, కాని ఇప్పుడిప్పుడు కొంచెము యౌవనోదయము గుచున్నకొలది నతనితో నంత చనవుగా ప్రవర్తించుటలేదు. రామారావును ఆమె యభిప్రాయ మెఱిగి మెలగుచుండెను. కాని ఇప్పుడామెదీనముఖమును జూచి అత డూరకుండలేక యేదియో చెప్పబోయెను. ఇంతలో నెవ్వరో వెనుకనుండి పిలిచిరి.

"ఏమిటండి చిన్నబాబుగారూ, అమ్మాయిగారి పూవుకోసి దాచిపెట్టి పైగా ఓదారుస్తున్నారు?" —అవచ్చినది దాసి.

ఇంతకు ముందు ప్రేమ పూరితములయి యున్న అతని కన్నులనుండి అంతలో నగ్నిస్ఫులింగములు వెలువడెను

"ఇదుగో సుబ్బీ, ఇలాటి మాటలంటే నేనూరుకోను—"

"ఊరుకోక పోతే," అని మెల్లగా, "ఊరెట్టుకోండి!"

"ఏమిటే!"

౨

వెంకటేశ్వర్లుగారు బహుసమర్థులు-అన్నివిషయములలోను. ఆయనకూడా అలాగే తరుచుగా అనుకొనుచుందురు. పుట్టినది బ్రాహ్మణ వంశమైనను, చేసే వృత్తి, మాట్లాడే మాటలు, చేసే ఆలోచనలు, అన్నియు పక్కా కోమటి లాగుననే. ప్రపంచమున ఏవస్తువుతోను ఆయన కవసరములేదు డబ్బేకావలెను. ఒక వరహా ఇచ్చే మాట యున్నచో ఒకచేయి కోసికొని రెండవ చేయి జాపగలడు. ఆయనకు ఒక్కతే కూతురు, కమల, చాలా చక్కనిది. పూర్వజన్మసుకృతమువల్ల ఆమెకు తండ్రి పోలిక రాలేదు. సౌందర్యమునకు తోడు సుగుణసంపన్నతకూడ కలదు. ఆకారణముచేత పరమలోభియగు తండ్రిప్రేమకు అంతగా నామె పాత్రురాలు కాలేదు.

కమలకు మేనరికమున్నది. వెంకటేశ్వర్లుగారి చెల్లెలి కుమారుడు రామారావు. పిల్లవాడు అందగాడే. చదువులో తెలివితేటలు కలవాడే కాని ఆస్తి ఎక్కువగా లేదు. పైగా ఎన్నటికైన పోలీసు ఇన్స్పెక్టరు పని చేయవలెనని సంకల్పమట. దగావర్తకమన్న ఒళ్ళుమంట యట. వెంకటేశ్వర్లుగారు చాలా ఆందోళనలో పడినారు పిల్లను ఇత్తామా వద్దా అని. వేరే ఇంకొక సంబంధమున్నది. చదువు సంధ్యలు లేవు. లేకపోయినను కావలసినంత ఆస్తి ఉన్నది. బాగా టక్కు టమార విద్యలలో గడితేరిన వాడు కుర్రవాడు. తమ వ్యాపారములో నిక్కలి సహాయభూతుడు కాగలడు. వాని కిచ్చిన బాగుండుననియున్నది వెంకటేశ్వర్లుగారికి.

ఇట్లుండ రామారావు తల్లి కాలధర్మము నొందెను. కుమారుని మూడవయేటనే యామె భర్తను గోలుపోయెను. అప్పటి నుండి ఆడుదియైనను మిగుల సమర్థతతో వ్యవహారములు చూచుకొనుచు కొడుకును వృద్ధిలోకి దెచ్చెను. ఎన్ని చిక్కులు పడుచున్నను వెంకటేశ్వర్లుగారు మాత్రము చెల్లెలికి ఏసాయమును జేసినవారు కారు. ఆమెయు పౌరుషము వహించి ఆతనినేదియు కోరలేదు. సంబంధము చేసికొనుట విషయములో కూడ అన్నవచ్చి బ్రతిమాలిననే చేసికొందు నని ఆమె యనుచుండెను. అదియే దొడ్డ దీవన యని అన్నగారు లోలోన సంతసించుచుండిరి.

చెల్లెలి చావు వల్ల వెంకటేశ్వర్లు గారి నెత్తిమీద పిడుగు పడ్డట్టయినది. తనకంటె మేనల్లుని కాత్మ బంధువులు లేరు. ఏకాకిగా పిల్లవానిని విడిచినచో చాలా అపయశమును బంధువిరోధమును కలుగునట్లు తోచెను కావున ఆయన చేయునదిలేక దైవమును నోటికివచ్చి నట్లెల్ల తిట్టుచు బోయి మేనల్లుని మెల్లగా నోదార్చి తన వద్దకు తెచ్చుకొనెను. కాని కొంత ఆలోచనమీద ఇది మేలే యని ఆయన తలచెను; రామారావు చిన్నవాడగుట వల్ల అతని ఆస్తి కాపాడు భారము తన యందుండును. మేనల్లుని నేలాగైన వంచినచో ముందు ముందు చాలా లాభమున్నది.

ఇప్పుడు వెంకటేశ్వర్లుగారి వర్తక వ్యాపారమునందు రామారావు జీతము బత్తెములేని గుమాస్తా!

3

"అమ్మా, నాగరం ఎక్కడ పెట్టావు?"

కమల ఇవతల గదిలో సోఫాపై పరుండి బాల నాగమ్మ కథ చదువుకొనుచుండెను. తల్లి మాట ఆమె వినలేదు.

"అమ్మా!"

"ఆ"

"నాగరం ఎక్కడ పెట్టావు?"

"చందువా పెట్టెలోనే."

"లేదే!"

"ఏమై పోతుందేమిటి? తిన్నగా చూడు."

"చూశాను, కనబడలేదు"

"ఏమో, అక్కడే పెట్టాను."

"ఇలా రా"

"ఎందుకు?"

"రా, చెబుతాను."

"అబ్బ, ఎందుకే?"

"రమ్మంటూంటే!?"

"ఊఁ"

కమల విసుగుతో పుస్తకము నేలకు కొట్టి పరుగెత్తివెళ్ళి తల్లి దగ్గరనిలిచెను. "ఊఁ, ఎందుకమ్మా?"

"ఏదీచూడు, పెట్టెలో లేదు."

"ఉండు, లే," అని కమల పెట్టెలో వస్తువులన్ని తీసి అటునిటు పారవైచి గబగబ వెతకసాగెను. నగ లేదు!

నిజముగా లేదు; తల్లి, కూతురు ఎన్నిసార్లు వెతకినను కనబడలేదు.

'నేను ఇక్కడే పెట్టానమ్మా!" అని వ్రేలితో పెట్టెసొరుగులో పొడుచుచు కమల చూపించెను.

"ఏమైపోతుందే, ఎవరు వస్తారే!"

కమల గుండెలు తటతట కొట్టుకొనసాగెను. ఆమె ఒక సంగతిచూచినది. దూరము యోచించిన కొలది హృదయము చెదరిపోవుచుండెను. తల్లితో చెప్పుదునా వద్దాయని ఆమెమనస్సు కలవలపడసాగినది. ఇరువురును కొంతసేపు ఆలోచించుచు నిలుచుండిరి.

తుదకు కమల మెల్లగా తల్లి దగ్గరకుచేరి మెడలో పట్టెడ సవరించుచు, "అమ్మా, బాబుతో చెప్పనని మాటయిస్తే ఒక సంగతి చెప్పుతాను" అనెను

"ఏమిటి?"

"ఇందాక బావ నాగరం తీసిచూస్తున్నాడు. దొడ్లోకి వెళ్లుతూచూశాను. మళ్లీ ఇంట్లోకి వచ్చేసరికి జాపకనబడలేదు; ఎక్కడికో వెళ్ళాడు. ఒకవేళ ఎందుకైనా తీసుకెళ్ళాడేమో కనుక్కో...,,

"ఏమి ఈమాత్రపు మాటనేను వినకూడనివాడనా?,, అనుచు వెంకటేశ్వర్లుగారు గదిలో ప్రవేశించిరి. కమల గుండెలు పగిలిపోయెను

"నేనంతా విన్నాను. మీరాదొంగ వస్తే మాటాడకూడదు. తెలిసిందా?,,

౪

నగపోయినందుకు వెంకటేశ్వర్లుగారికి అంత ఎక్కువ చింతగానుండెనని చెప్ప జాలము. దానిని పారవేసుకొన్నందుకు ఆదుఃఖమంతయు ఆయన భార్యదే. తిరిగి దానిని ఆయన ఎన్నటికిని చేయించి ఈయబోడు. కావున అది యున్నను లేకపోయినను ఆయనకొకటే. కాని రామారావుపై పూర్తిగా కోపము ప్రజ్వరిల్లుచుండెను. మేనల్లుడు చౌర్యము చేసినాడా యనుశంక వారికెంతమాత్రమును లేదు. వానిని తనవద్ద నుంచుకొనవలెనన్న ప్రథమ సంకల్పమును అంతజయప్రదముగా కొనసాగుటలేదు. రామారావు తనఆస్తివిషయమై పదేపదే కనుగొనుచు బహుజాగరూకత కనబఱచుచుండెను. పైగా తనకు విద్యకొనసాగింపుమని మేనమామను చాలా బలవంతపెట్టుచుండుటను. అందువలన వెంకటేశ్వర్లుగారికి మేనల్లునిపై లౌకిక సంబంధమయిన ప్రేమకూడ గతించి వానికి త్వరలో ఉద్వాసన జెప్పుటయే శ్రేయస్కరముగా దోచుచుండెను. ఇట్టి సమయమున నగపోయినది. ఇప్పుడు దురాగ్రహ పరవశుడై యజమాని కర్తవ్యము నాలోచించుచు మేనల్లుని రాకకై వేచియుండెను.

కొంతసేపునకు అపరాధి వాకిట నెవరితోడనో మాటాడుచున్నట్లు వినవచ్చెను. అతడు లోనికి రాగానే వానితోనెట్లు సంభాషింపవలెనో ఎట్లు దూషింపవలెనో అన్నియు నిరూపించుకొనుచు వెంకటేశ్వర్లుగారు తయారుగానుండిరి. రామారావు మాటాడుట ఆగిపోయెను. కొంతసేపటికి ఎవరో తన గది వంకకు వచ్చుచున్నట్లు చప్పుడయ్యెను. వెంకటేశ్వర్లుగారిముఖ మగ్నికురియ దొడగినది. ఆయన గుమ్మమువైపు వీపుత్రిప్పి కూర్చుండెను. గది తలుపు తెఱచుకొని ఎవరో మెల్లగా లోపలప్రవేశించిరి. అపర దూర్వాసునివలె యజమానుడు చివ్వున లేచి తిరిగి చూచెను. అది దాసి!

"ఏమి, ఎందుకు వచ్చావు? ప్రొద్దుటినుంచి ఎక్కడికివెళ్ళావు?"

దాసి చేతిలోని కాగితము తటతట కొట్టుకొనుచుండెను. ఆమె ప్రత్యుత్తరమీయలేదు.

"ఏమిటా కాగితము?" అనిఆయన చేయిచాచెను.

దాసి వినయపూర్వకముగా దాని నందిచ్చెను. చూడగా నది పదిరూపాయల నోటు!

"ఎక్కడిదిది నీకు?" అని యజమాని గద్దించి అడిగెను.

దాసి నిలువెల్ల కంపించుచు నుండెను, అది తడబడుకొనుచు "చిన్నబాబుగారు సామీ, వాకిట్లో ఎవరో కంసాలి లాగున్నాడు ఆయనతో మాట్లాడుతూ జేబులో కాగితాలు తీసుకోవడంలో ఇది క్రింద పడిందండి. నేను తోటలో మొక్కలకు నీళ్ళుపోస్తూ చూశాను, సామీ. వారు తీసుకుంటారనుకున్నాను తీసుకోకుండానే వెళ్ళిపోయారు. నేను వాకిట్లోకి వెళ్ళే సరికి వీధి మలుపుతిరిగి పోయారు కామోలు్న కనబడలేదు. ఏం కాగితమో అని తెచ్చాను సామీ!" అని ప్రత్యుత్తరమిచ్చెను.

రామారావు జేబులో పదిరూపాయలనోటు! ఎక్కడనుండి వచ్చినది? ఇట్టివింకెన్ని కలవో! అవును, నగవిషయమున ఇక ననుమానపడ నవసరము లేదు.

"సరే. నీవు వెళ్ళు. వాకిట్లోనే ఉండి రామారావు రాగానే సరాసరి నా దగ్గిరకు రమ్మని చెప్పు. పో!"

౫

"రామారావుగారూ, తమరు చాలా పెద్దమనుష్యులు. ఇలాదయచేయండి తమ ఆస్తి విషయమై చాలా ఆదుర్దా పడుతున్నారు. ఇదుగో జమా ఖర్చు లెక్క అంతా తేదీ వారీగా వేసి ఉంచాను. మైనారిటీ వెళ్ళిపోతుంది గనుక తమరు శ్రద్ధగా ఆస్తి వప్పజెప్పుకొని తమ యింటికి వేంచేయవచ్చును. ఈనాటి మీ చర్యతో మన సంబంధ బాంధవ్యములన్నీ అంతరించినవి!"

రామారావు నిర్ఘాంతపోయెను. ఆ దయ మాతకు కమలతో కొంచె మధికముగా సరసమాడి యుండెను.

"నీవు వట్టి అమాయకునివలె నటింప నవసరము లేదు. కమల చెప్పినది నేను విన్నాను."

"కమల చెప్పినదా నేను తప్పు చేశానని?,,

"కమల ఎందుకు చెప్పుతుంది? దాసి చూచింది.,,

"దాసి పరమ దుర్మార్గురాలు!,, రామారావు మొగము నెత్తురు కండ అయ్యెను. దాసి అప్పుడచ్చటనున్నచో దాసిప్రాణములు దక్కియుండవు. రెండునిముసములు నిశ్శబ్దముగా గడచెను.

"మామయ్యా, నేనే మనకూడనిపని చెయ్యలేదు. కమలను పిల్చి మళ్లీ అడగవచ్చును. మొదటనుంచీ నాకాశగొలుపడం చేత నేనలాటి భావముంచాను కాని లేకపోతే—,,

"అవును. మొదటినుంచీ నాధన మిస్తానని నీకాశగొలుపుతున్నాను. చాలా నిజము. దానిమీద నీకంత ప్రేమగలిగినందుకు నాకు ఎంతో సంతోషము!,,

"నీధనమెవ్వరికి కావలె?,,

"నాకూతురు నగలు మాత్రము కావలె,,

"అవ్వి వద్దు తీసుకో,,

"ముందే నీవు జాగ్రత్త పడుతూంటే నాకెక్కడ అవకాశము?,,

"నాకెందుకు?,,

"ఇవ్వాళ నాగరమెందుకు కావలసి వచ్చింది?,,

"ఏమి నాగరం?,,

'ఇందాక నీవు చందువా పెట్టెలో నుంచి తీసుకుని జేబులో వేసుకున్నది.,,

రామారావు మొగము వెలవెల బోయెను. అతడు తడబడుచు, ,,నాగరము పోయిందా?,, అనెను.

'అబ్బే పోలేదు. కంసాలివద్ద ఉండవచ్చును.,,

"నాకేమీ అర్థము కావడం లేదు."

'అవ్వను ఎలాగా కావడం! కాని నీకాగితాలనుంచి ఈనోటుజారిపడింది. ఇది నా కర్థమవుతూంది."

"నాకాగితాల్లో ఇది ఎక్కడిది?"

"నీకే తెలియాలె. వీధి గుమ్మంలో పడితేసుబ్బి తెచ్చి ఇచ్చింది." రామారావు దాని కోసము చూచెను. కాని అది లేదు "ఇదంతా సర్వఅబద్ధం!"

"నీవు పెట్టెలో నాగరం తీసినది కూడా అబద్ధమేనా?"

"కాదు. చందువా మూత తెరిచి ఉంటే వెళ్ళిచూశాను. నాగరం కనబడితే తీసి-చూచి మళ్ళీ పెట్టివేసినాను."

"నీవుచాలా బుద్ధిమంతుడవు, నిన్ను పోలీసుకు పప్పజెప్పక ఊరికే పంపడమేమహోపకారము ఇక వెళ్ళిపో"

రామారావు హృదయమున బల్లెము గ్రుచ్చినట్లయ్యెను: అతడు మేనమామవంక కఠినముగాజూచి అనెను.

"మీరుచాలా పొరబడుతున్నారు. ఇంత కాలము నుంచీ—"

"అధిక ప్రసంగముచేయకు. నడు" వెంకటేశ్వర్లుగారి కంఠస్వరము అతి కఠోరముగా నుండెను. రామారావు శరీరమూపాద మస్తకము మండిపోజొచ్చెను. "ఎన్నటికైనానీవు దీనికి పరితపిస్తావు! అని అతడు అస్పష్టముగా బెదరించుచు కమలకోసమైన నాగరకచ్చును ఇలువెడలిపోయెను. వెనుక నెవ్వరో చల్లగా నవ్విన శబ్దమయ్యెను. కాని అతడు తిరిగి చూడలేదు

౬

ఒకనాటి ఉదయమున వెంకటేశ్వర్లు గారు గదిలో పచారుచేయుచు దీర్ఘాలోచనలో మునిగి యుండిరి. కమలకు పెండ్లియీడువచ్చినది. వరుని విషయమున నేదియు పాలుపోవుట లేదు. ఇంటిలో భార్యాభర్తలకు నిత్యమును జగడమే. ఇక కమల విచారమునకు మేరయే లేదు. బావ పేరు ఉచ్చరించుటకైన నింటిలో వీలు లేదు. అతని జాడ్చి వార్తకూడ తెలియుటలేదు. ఎక్కడనున్నాడో, తనను ఎన్నడైన తలచుకొనునో లేదో, పెండ్లి చేసుకొననేమో! ఆమె కన్నులనుండి అశ్రువు లేకధారగా ప్రవహించుచుండెను. అతని దప్ప ఇతరుని పెండ్లియాడవలసి వచ్చినచో ఆత్మహత్య చేసుకొనుటకు ఆమె లో

లోన పీకకలుగుకొనుచుండెను.

రామారావుపై చౌర్యమారోపింపబడినను ఆమె మాత్రమది నమ్మలేదు. నగ ఏమైపోయినదో పరమేశ్వరునకే తెలుసు. తన బావ అలాటి పని చేసియుండడని ఆమె నిశ్చయము. అతని కష్టములకన్నిటికి తానే కారణమని ఎల్లప్పుడు తాను నిందించుకొనుచుండును. కాని ఎప్పటికైన అతను అనపరాధిగ బయలువెడలునని ఆమె కొక పిచ్చి నమ్మకము మాత్ర కలదు.

ఆనాడు యజమాని సంబంధము నిశ్చయించుటకు ఉద్యుక్తుడగుచుండెను. ఇంతలో ఎవ్వరో తలుపు దట్టిరి. తలుపు తెరువగా పోలీసు ఇన్స్పెక్టరుగారు ప్రవేశించిరి.

“సాహుకారుగారూ, మీదాసి యెక్కడయ్యా?”

“ఎవరు సుబ్బియేనా? ఎందుకండీ?”

“ఎందుకైతే మీకెందుకు? ఇలా వేగిరం పిలిపించండి.”

దాసివచ్చెను. వెంటనే ఇన్స్పెక్టరుగారు దానిచేతులకు చల్లగా సంకెలలు తగిలించిరి. అది పెద్దపెట్టున బొబ్బలిడుచు గొల్లున నేడువసాగెను. కాని పోలీసు బెత్తము దాని నోరుమూసినది. ఇన్స్పెక్టరుగారు యజమానివంక దిరిగి “ఏమయ్యా దిగాలపడి చూస్తారు? ఇలాటి ధగిడీల మాట విని రత్నంవంటి మేనల్లుణ్ణి వెళ్ళగొట్టారు కామా. ఇదిగో మీనగ. ఇక తృప్తిపొందండి!” అని చూపిరి.

“ఏమిటిది?” వెంకటేశ్వర్లుగారి సంతోషమునకును ఆశ్చర్యమునకును మేర లేదు. “మీకెక్కడ దొరికింది ఇది? సుబ్బినెందుకు ఖయిదు చేశారు? నాకేమీ బోధపడడం లేదు,” అన్నాడు.

“పెద్దపెద్ద వ్యవహారాలు చేస్తారు, ఏమిటయ్యా మీ తెలివితేటలు! ఈముండ కంసాలివాడితో ఏకమై నాగరం కొట్టేసి రామారావు జేబులోదని నోటు తెచ్చి మీకిచ్చింది! రామారావువచ్చి తనకు జరిగిన పరాభవం మాతో చెప్పకుంటే మెల్లిగా కూపీతీసి చోరీఅంతా పైకిలాగాం. నగ అప్పుడే మీకివ్వడానికి వీలులేదు. విచారణ జరగాలె. మీకు సమన్సు వస్తాయిలెండి,” అని ఇన్స్పెక్టరుగారు వెళ్లుటకుసిద్ధమైరి.

“చిత్తం. చాలా తెలివితక్కువపని చేశాను”

“మెల్లిగా అంటారేం?”

“చిత్తం చిత్తం. ఇంతకూ మేమదృష్టవంతులము. మహాప్రభువులు దయ చేశారు కనుక మా మర్యాద దక్కింది. మా వాడు ఎక్కడవున్నాడండి?”

“మాయింట్లో ఉన్నాడు. ఇక మీ యింటికి రాడట.”

“మా ప్రాప్తం. సెలవు. నమస్కారం”

“ఈవంకరదణ్ణాలకేమివచ్చెలే,” అనుకొనుచు ఇన్స్పెక్టరుగారు దాసిని స్టేషనుకు ఈడ్చుకొని పోయిరి.

౭

“ఎందుకు కమలా, నవ్వుతున్నావు?”

“ఒకమాట జ్ఞాపకం వచ్చింది.”

"ఏమిటామాట?"

"చెప్పను."

"చెప్పవూ?"—

"చెప్పుతా చెప్పుతా. ఉండండి. మరీ పెండ్లిమాట మాటాడడానికి మా బాబు మీయింటికి వస్తే, మీరు, "ఎవరావచ్చేది? ముందువీధిలోకి గెంటెయ్యి" అంటూ కేకవేశారట కాదూ?"

"నేను కలగన్నానా యేం పెండ్లి మాటమీద వచ్చాడని? చోరీఆస్తివిషయమై నా వెతకడానికి వస్తున్నాడనుకున్నాను"

"ఏలాగైనా మామగారు కదా, అలా—"

"మామగారు కాదు దోమగారు! ఇక ముందు ఆయనమాట ఎత్తబోకు."

"అబ్బాయీ, మాయింట్లో వచ్చి ఉండు మాఅమ్మాయినిస్తాము' అంటే, 'నేను మీయింటికి రాను, పిల్లనివ్వదల్చుకొన్నారా తీసుకువచ్చి ఇక్కడ దిగవిడ్చండి' అన్నారట కాదూ? మేమంత తీసివేసికున్నామా యేం మీముందు?" అని చిరునవ్వుతో అన్నది.

"ఇదిగో పిల్లా! నవ్వులాట కాదు సుమా! ఈతడవ మీనాయన పేరు ఎత్తావంటే చిన్న పుట్టింటికి తగిలేసి ఇక ఈ జన్మకు తీసుకురాను"

"వద్దు. ఇక మాట్లాడితే అప్పుడనండి!"

## "తరంగమాలిక" నుండి

పెద్దిభట్ల పూర్ణశర్మ

ప్రేయసీ, కంట తడి సిప్పు పెట్టునెడల
మోము విన్నదనంబును బూను నెడల
ఇచ్ఛయుండదు చేయుట కేదినాకు [బు
ప్రకృతియంతయు ఘోరాంధ్యబంధురం

నామనోరంజనీ, విను నీముఖమ్ము
స్మితమధురభాషణములు వర్షించుచున్న
అలలపైఁ దేలియాడెడి హంసరీతి
నామనం బోలలాడు నానందజలధి!

౨

కష్టములజాడఁ గాంచి వెక్కండ్రుభువిని
భీరువులై కోలుపోవుదు రున్న బలము
దుఃఖపడినను కష్టముల్ తొలఁగిచనవు!

కష్టములలోన పుట్టువు గాంచినాడ
మోమునను మందహాసంబుఁబూనినాని
తేటిపాటి విలోకింపఁ బాటిపోవు!

నానొసట వ్రాసిలేవు చింతాక్షరములు!
ఎన్ని కష్టాలు వచ్చి నన్నేమి చేయు?
చలము బలమును విడక నిశ్చలత నిలుతు
అతులవృష్టి ప్రకంపనోద్ధతుల కోర్చు
గండశైలాంతరస్థ వృక్షంబు వోలె.

# మాధవీకంకణము

## ౨౭

కొన్నిరోజులు ప్రయాణము చేసినతరువాత జస్వంతసింగు సైన్యము ఆగ్రానగరము చేరెను. ఔరంగజేబు పరాక్రమమునకుమితిలేదు; వానితో బహిరంగయుద్ధము చేయుట జస్వంత సింగునకు సాధ్యముకాదు. కావున యతండు తరుణమునకు వేచియుండెను. ఔరంగజేబు పరమశత్రువు విశ్రాంతిగా నగరము ప్రవేశించెను.

యమునానదీశోభను, ఆగ్రానగరపు రామణీయకమును గాంచి, మెవరుముగ్ధులు కాకుందురు? శ్వేతశిలా వినిర్మితము, అపూర్వ శిల్పఖచితము, అద్వితీయమునగు తాజ్ మహల్ సాయంకాలమున నాకాశమందు చిత్రమువలెఁ గన్పట్టుచుండెను. దానికి నల్వంకల చక్కని తోటలు, ఆరామములు, కేళాకూళులు. పార్శ్వమున నల్లని యమునానది యుఁగలవు. ఆగ్రాదుర్గము పెద్దది. దానియందు తెల్లరాతితోఁ గట్టిన చక్కనిమోతిమస్జిదు, దివాన్ ఖాస్, దివాన్ ఆమ్, రంగ్ మహల్, షీష్ మహలు లున్నవి.

ప్రసిద్ధమైన మయూరసింహాసనమున నేఁడు ఔరంగజేబు పాదుషా ఉపవేశించి యున్నాడు. ప్రాసాదపు శ్వేతస్తంభపంక్తి మిక్కిలి శోభాయమానమైయుండెను. ఎఱ్ఱనిచాందినినుండి పుష్పదామములతోపాటు మణిమాణిక్యములు వ్రేలాడుచుండెను. ప్రాభాతిక కాంతిస్పర్శచే నామణులుధగధగ లాడుచుండెను. నల్వంకల మహారాజులు, రాజులు, ఉమ్మరాహులు, మన్సబ్ దారులు, భారతవర్షమున నగ్రగణ్యులగు వీరులు, ధనవంతులు, పూజ్యులు నగువారు నేఁడు రాజప్రాసాదమును స్వర్లోకము గావించినారు!

ఆప్రాసాదముసెదుట విశాలశిబిరము సంస్థాపితమై యుండెను. దానికినాల్గువైపుల వెండికంబములు ప్రకాశించుచుండెను. పైభాగమున నెఱ్ఱని వస్త్రము, లోపల మచిలీపట్టణముచీటీలు, నిజమైనపుష్పములవలె భ్రమగలిగించు పూవులు చిత్రించిన చీట గుడ్డలు పార్శ్వమునందు నుండెను. నేలపై తివాచీలు పఱచియుండెను. అందు నేసిన పూలు నడచువారికి భ్రాంతి గల్పించుచుండెను.

దాని కావలినుండి దుర్గప్రాకారమువఱకు విజయధ్వజములు, పుష్పమాలికలును మనోహరముగా నుండెను. సైనికులు శ్రేణీబద్ధులై, విజయవాక్యములతో నెల్లర నుత్సాహము గల్గించుచుండిరి. తెల్లనిరెండుకో భటుల బందూకులు తళతళ లాడుచుండెను. దుర్గప్రాకారములపై అంగ్రేజీ, ఫరాసీ, డచ్చి సైనికులు పెద్దపెద్ద ఫిరంగులను పేల్చుచుండిరి. రత్నగర్భయగు భారతవర్షమునందలి రత్నములను సంగ్రహించుటకు వారలు బహుదూరదేశములనుండి వచ్చియుండిరి. జీతములు పుచ్చుకొనుచున్నవారు చక్రవర్తివిజయమును నేఁడు ప్రకటించుచుండిరి దుర్గము వెలుపలను, నగరవీథులందును, ఘట్టములయందు, గృహములయందును, ద్వారములందు, యమునాతీరమునందు జనులు గుంపులుగుంపులుగాఁ గూడియుండిరి, వారు మంచివస్త్రులనుదాల్చి యెల్లెడ విహరించుచుండిరి.

ప్రాచీనాచారము చొప్పున ఔరంగ్ జేబు బంగారముతో తులఁదూగెను; తరువాత ప్రధానులను నుమ్మరాహులుగూడ తులఁదూగిరి. రాజులు, మన్సబ్ దారులు మొదలగువారు ఒక్కరొక్కరుగా సువర్ణమును, ముత్తెములను, వజ్రములను కానుకగానొసఁగి, పాదుషాను సంతృప్తి చేసిరి.

అటుతరువాత యౌవనోన్మత్తలు, ప్రౌఢలు, లోకమోహినులు నగు వారాంగనలు అపూర్వ నృత్య సంగీతాదులచే సభాసదుల హృదయములను ముగ్ధములు చేసిరి. పెద్దపెద్ద ఉమ్మరాహుల యిండ్లలో వివాహము లగుపక్షమున నాట్యాంగనలు సంగీత నృత్యాదికమునకుఁ బోవుచుందురు. షాహజహాన్ చక్రవర్తి వారిని తన సన్నిధి నుంచికొని సన్మానించుచు, బేగముల మేడలకుఁగూడ దీసికొని పోవుచుండువాఁడు. కాని, ఇంద్రియసుఖపరాఙ్ముఖుఁడు ఔరంగ్ జేబువారాంగనలను తన దగ్గరకుఁగూడ రానిచ్చువాఁడు కాడు. అయినను, ఆపండుగు రోజున భోగస్త్రీలుగూడ నాదరము నొందిరి.

తరువాత దుర్గమునకు తూర్పుదిక్కున, అనగా యమునాతీరమున మల్లయుద్ధము, ఖడ్గయుద్ధము మొదలగు నానావిధయుద్ధములు జరుగసాగెను. అంతఃపురము పైభాగమునుండి బేగములు చూచుటకు వీలుగా ఆప్రదేశమున పోరాటములు జరుగును. చివరకు రెండు మత్తగజములపోరు ప్రారంభమయ్యెను, మధ్యప్రదేశమున రమారమి రెండు మూరల యెత్తుగల మట్టిగోడయుండెను. దానికి రెండువైపులనుండి రెండు మదపుటేనుఁగులు మావటీవాండ్రు నడపుచుండ పోరునకు డీకొనెను. యమునానది కిరుప్రక్కలనున్న జనులు సవిస్మయముగా చాలసేపీ భయంకర యుద్ధము నవలోకించిరి. తొండముల దెబ్బలతోను, దంతాఘాతములతోను రెండుమాతంగముల శరీరములు జర్జరితము లయ్యెను. ఒక్కొక్క యేనుఁగున కిద్దఱు మావటీలు ఉండిరి. ఒకదాని పైమావటీడు క్రిందఁబడి యేనుఁగుఁకాళ్ల తొక్కిడిచే మరణించెను. రెండవదానిపైవాఁడు కూడ నదేవిధముగా బడి తన హస్తము విఱుఁగఁగొట్టుకొనెను. మిగిలిన దీను లిర్వురు జీవితాశ విడిచి, యేనుగులచే యుద్ధము చేయించుచుండిరి. భార్యాపుత్రుల కడ కడసారిసెలవు తీసికొని, ధనలోభముచే వారు వచ్చియుండిరి. తరువాతఁ గొంత సేపటి కొక మాతంగము రెండవదాని నోడించి, మట్టిగోడ దుమికి, దాని వెంటఁబడెను. వానిని విడిపించుటకయి జనులు తోటాలు మొదలగు బాణసంచు కాల్చి విసరిరి. కాని, క్రోధోన్మత్త మాతంగము దానిచే శాంతి నొందక రెండవదాని వెంటఁ బరుగెత్తుచుండెను. తుదకు పరాజితమైన గజము యమునలో దుమికి, ఈది యావలివడ్డుచేరెను. త్రోవలో నొకరిద్దరు ఎదురుపడినవారు మృతినొందిరి.

ఈవేడుకను జూచి నరేంద్రుఁడు మెల మెల్లన యమునాపులినమునకుఁ జనెను. ముఖప్రక్షాళనాదికము కావించి యతఁడొక కమనీయ వృక్షమూలమున శయనించెను. అది మనోహర ప్రదేశము. విశాల తమాలవృక్షములు సూర్యకిరణములను నివారించుచుండెను. చెట్లకొమ్మలపై నొకటి రెండు పక్షులు దినకరతాపముచేఁ బడలి, మృదుస్వరమున కూజితములు సేయుచుండెను. చేరువచెట్లప్రక్కన ప్రాచీనగోరీ యుండెను. అది యచ్చటచ్చట బ్రద్దలై పోయినది. రావి మొదలగు చెట్లు, తీగెలు దానిపై మొలచియున్నవి. దానికొకవైపున పారసీభాషలో ఈయర్థమిచ్చు నక్షరములు చెక్కబడి యున్నవి.

"బంధూ, నాపేరు తెలియవలసిన యక్కఱ యేమి? లోకములో నేను దురదృష్టవంతురాలను, దీనురాలను, నీవును దీనుఁడవయినపక్షమున నాకొఱకు బాష్పకణము విడువుము." చల్లనిగాలి యాప్రదేశమును మఱింత శీతలముగ జేయుచుండెను. నరేంద్రునకు త్వరలో నిద్రపట్టెను.

అతఁడెంత కాలము నిదురించెనో సరిగా చెప్పటకు వీలులేదు. నిద్రలో నరేంద్రుఁ డొకవింత కల గాంచెను. గోరీనుండి యొకప్రాణి బ్రతికి వచ్చినట్లుండెను. ఆమె యవన రమణి. ఆమె ముఖము పాలిపోయియుండెను; ఆమె కన్నులు లోపలికి పీకుకొనిపోయి యుండెను; శరీరము క్షీణము; సమస్తావయవములు దుఃఖము సూచించుచుండెను. గోరీమీఁది గీతము నామె పఠించుచున్నట్లుండెను. విచారవ్యంజక గీతారవముచే నరేంద్రుని ముకుళిత నేత్రములనుండి యశ్రుబిందువులు రాలెను. ఆమె వెంటనే యింకొక గీత మారంభించెను. నరేంద్రునకా గీతము నూతనము గాదు. ఆకంఠధ్వని దీనురాలు జలేఖా దని స్పష్ట మయ్యెను. నిజముగా జలేఖా గోరీపై గూరుచుండి విషాదగీతము పాడుచుండెను.

నరేంద్రునకు మెలకువవచ్చెను. నలుదిక్కులు నాతఁడు కలయఁజూచెను. ఎవ్వరు కనఁబడలేదు. సూర్యుఁ డస్తమించెను. సంధ్యాలలాటమున నొక నక్షత్రము తళతళలాడు చుండెను. సాంధ్యవాతము మెల్ల మెల్లన వీచుచు, మృదులగానము సేయుచుండెను. యమునాజలము సంజవేళమిగులనీలముగాఁ బ్రవహించుచుండెను.

నరేంద్రుఁ డాశ్చర్యపడెను జలేఖాగీతిక నిదివఱకాతఁడు నాల్గుసారులు స్వప్నావస్థలో వినియుండెను. నరేంద్రుని హృదయము జలేఖావైపు మొగ్గినదా? అంతనాతఁడు తనహృదయమును పరిశోధించి చూచెను: అంతరంగము హేమలతామయము! జలేఖా మానుషి కాదా? దేవకన్యయా? అట్లయినచో మనుష్యునిప్రేమ వాంఛింప నేల? ఆలోచనలో మునిగి నరేంద్రుఁడు గోరీకడకుఁ బోయెను. అచ్చటనిజముగా జలేఖా నిలిచియుండెను. ఆమెక్షీణశరీరమును పాండుర ముఖమును జూడసమాధిలోనుండియామె బయటికి వచ్చినట్లే

యామె శరీరమందలి రక్తము ముఖమున కెక్కి నేత్ర, శ్రవణ, లలాట, కంఠము లెక్కి వెట్టిన నెఱ్ఱవారెను. అంత శీఘ్రముగనే వదనమండలము పాండురమయ్యెను, దేహము కంపము నొందఁ జొచ్చెను, ఫాలమునుండి స్వేదబిందులు రాలెను.

శైవలిని భయముతో హేమను బట్టుకొనెను హేమలత కొంచెము శాంతి నొందిన పిమ్మట శైవలిని గంభీరస్వరమున నిట్లనెను:

“హేమా, నిన్ను నేను పిల్లలికంటె ఎక్కువగా ప్రేమించినాను. నేఁడు నరేంద్రునకుఁ గనఁబడక, నామాట విని యింటికి పదు. నీవు నన్ను సోదరికంటె ఎక్కువుగా ప్రేమింతువు; నాయీమాట విని, యింటికి పదు. నీవు చిన్నదానవు; నీమనస్సు నీకే తెలియదు. నరేంద్రునితో నీవు సంభాషించిన యెడల ఏమిచిక్కు సంభవించునో దేవున కెఱుక!”

అవనత వదనయై హేమలత చాలతడవు నేల వంకఁ జూడసాగెను. కందోయినుండి యొకటి రెండుబాష్పములు స్వచ్ఛసికతాతలమున రాలి యదృశ్యమయ్యెను. అంత నామె మొగ మెత్తెను; అప్పు డుద్వేగచిహ్నము లేమాత్రము లేవు; ఆమె ముఖము నిర్మలము, శాంతము, స్థిరమునై యుండెను; నేత్రమున మాత్ర మశ్రుకణము కూడుకొని యుండెను.

హేమలత శైవలిని జూచి యిట్లనెను: “వదినా నీవు నాప్రాణప్రియవు; నన్ను విశ్వసింపకుండ వద్దు. అనుదినము నీవు నా కెన్ని ధర్మములు బోధించినావో; నేను వానిని మఱవలేదు. వదినా, నేను విశ్వాసఘాతకురాలను గాను. నేఁడు దేవతారాధనము జేసి, యీపుణ్యభూమిపై నిలిచి ఈ పవిత్ర దేవాలయమున విశ్వాసము విడువను. నాకుప్రధానదేవతయైనభర్తనన్ను ప్రేమించుచుండఁగా నాజీవితపు ధననిధి యగు వారి విశ్వాసఘాతకురాలు కానేరను. వదినా, నాయెడ ననుమానము వలదు; నన్ను దుర్మార్గురాలినిగా నెంచవద్దు. నీవు నన్ను తప్ప దలఁచినచో ఈలోకమున ఈదీనురాలి నెవరు ప్రేమింతురు!”

హేమలత కన్నులనుండి నీరు జలజల కాఱి ముఖము దడిపెను.

అపుడు శైవలిని మనసు శాంత మయ్యెను. ఆమె హేమ కన్నులు సస్నేహముగాఁ దుడిచి యిట్లనెను. “హేమా, నన్ను క్షమింపుము నీవు ధర్మపరాయణవు, పతివ్రతవు. అట్టి నిన్ను కొంతసేపు సందేహించి నందులకు క్షమింపుము!”

“వదినా, నీవు క్షమాపణ కోరవద్దు. నీదయ, నీ ప్రేమ, నీఋణము ఈజన్మములో నేను తీర్పుకోలేను; జన్మజన్మాంతరములకుఁగూడ నీకు మఱదలినై పుట్టవలెనను కోరిక తప్ప నాకు మఱి వాంఛలేదు.”

కొంచెముసే పిద్దఱు మిన్నకుండిరి. ఇరువుర నేత్రములనుండి బాష్పములు స్రవించుచుండెను. అంతట శైవలిని హేమతో, “ప్రొద్దు పోవుచున్నది; నరేంద్రుని జూచి వత్తువు కాని,” అని పలికెను.

శైవలిని వృక్షతలమున వేచి యుండెను, హేమలత దేవాలయములోఁ బ్రవేశించెను. అప్పు డామె కుద్వేగము లేదు; నెమ్మదిగా నరేంద్రుని సమీపమున కరిగి, నమ్రభావముతో నేలవంకఁ జూచుచు నిలిచెను.

తనప్రాణసమాన యగు హేమలత యింతకాలమునకు లభించుటచే నరేంద్రుని హృదయ ముద్వేగపూర్ణ మయ్యెను. నోరు మెదల్ప లేకయతఁడు హేమలత హస్తమును కేవలము పట్టుకొని, పిపాసార్తునివలె అమృతమయమగు నాముఖమండలమును జూడసాగెను. అతని శరీరము వణఁకుచుండెను, కనులనుండి యశ్రువులు జలజల రాలుచుండెను. హేమలత సహనము గోల్పోయి తలవంచెను; ఆమె నేత్రములు బాష్పధారలు కురియుచుండెను.

కొంతతడవునకు హేమలత స్థిరదృష్టితో నరేంద్రా! అనెను.

నరేంద్రుఁడు చూచెను. ఆమెముఖమున నుద్వేగ చిహ్నములు గాని, లజ్జా చిహ్నములు గాని లేక వదనము నిర్మలముగ నుండెను. హేమలత నరేంద్రా! యనెను.

౩౪

అప్పటికి దేవాలయములోని దీపములు దీప్తి వేసిరి. జను లెల్లను వెడలిపోయిరి. స్తంభముల మీఁదను, ఆవరణమునను, వెన్నెల పడుచుండెను. స్తంభముల నీడలు నేలపైఁ వ్రాలి యుండెను. పార్శ్వ

మున యమునానది వెన్నెలలో శాంతముగాఁ బ్రవహించుచుండెను. శీతలవాతము నదీజలము మీదుగా మందిరమున వ్యాపించి, యాఁకలికి వీచుచుండెను. ఆ రాత్రివేళ, పవిత్ర దేవాలయమున నొక స్తంభపునీడను హేమలతా నరేంద్రులు నిలిచియుండిరి.

హేమ దృఢముగా నిట్లనెను: “నరేంద్రా, బహుకాలమునకు సమావేశ మయినది; ఇఁక చిరకాలమునకుఁ గాని మరల సమావేశము కాదని నా యూహ. మనమనస్సులలోని మాటలు మాటలాడుదము. నరేంద్రా, చిన్నతనమున మన మిద్దఱము గంగాతీరమున నాడుచు ఎన్ని కలకరించువారము! ఇప్పుడు నీవు సైనికవ్రతము నవలంబించినావు; నేను పరస్త్రీని. నరేంద్రా, చిన్ననాఁటి స్వప్నముల నొక్కసారిగా మఱచిపొమ్ము!”

హేమలత కొంచెమూరకుండి మరల నిట్లు పలికెను: “విధాత యింకొకరీతిగా లిఖించియున్నచో మనజీవితములు వేఱుగానుండి, బాల్యస్వప్నములు సఫలములైయుండును. కాని, నరేంద్రా, మనము భ్రమచే విధాతను నిందింపరాదు. నీకు శౌర్యమును, కీర్తిని దయచేసినవానిని ధ్యానింపుము, తప్పక నీకతఁడు సుఖము లొసఁగును. నాకీ లోకమున జన్మము కలిగించి దేవతుల్యుఁడగు భర్తను ప్రసాదించి, శైవలిని వంటి యాఁడుబిడ్డ నను గ్రహించి, సంపదల నొసఁగిన దయాసముద్రునకు నమస్కారము!”

కంఠమున చీరచెంగు వేసికొని చేతులు జోడించి, విశ్వమున కాది పూరుషునుద్దేశించి యామె నమస్కార మొనర్చెను. ఆమెముఖము తేజోవంతము పవిత్రశాంత రసపూర్ణమునై యుండెను.

నరేంద్రుఁ డాశ్చర్యముతో హేమలతను విలోకించెను. ఆతనినోట మాట రాలేదు. హేమలత క్రమ్మఱ నిట్లు చెప్పసాగెను: “నరేంద్రా” నీవనేకయుద్ధములు చేసినావనియు బహుదేశములు సంచరించినావనియు కీర్తిసంపాదించితి వనియు వింటిని. నీవు ధర్మాత్ముఁడవు భగవంతుడు నీకు సౌఖ్యము లిచ్చుఁగాక! నీవు యుద్ధవృత్తిమానెంతువేని కష్టములకుగాని లేమికిఁగాని లోనయితివేని తిరుగ వీరనగరమునకు రమ్ము నీవు వచ్చినయెడల నందఱు సంతోషింతురు. నాభర్త హృదయము నెఱుఁగుదును. ఆయన నిన్ను తమ్మునివలె ప్రేమించును, సస్నేహముగా నీవార్తలు చెప్పుచుండును. నీవు వత్తువేని ఆయన మిక్కిలి సంతోషించును!”

నరేంద్రుఁడు నీరవముగా నుండెను. హేమలత పలుకు లాతనిచెవులలో నపూర్వగానము చేయుచున్నట్లు తోచెను; ఆతనిహృదయము, నేత్రములును నిండుగానుండెను.

హేమలత మరల నీవిధముగా బలికెను. “మఱి నీవు వచ్చినపక్షమున శైవలిని యెంతో సంతోషించును. బ్రతికియున్నంతకాలము చెల్లెలివలె నీకు శుశ్రూష చేయుచుండును. భాయీ, నరేంద్రా, నిన్ను జూచినప్పుడే నాకానందము!”

ఈ స్నేహవాక్యముల నాకర్ణింప నరేంద్రుని నేత్రములు మరల బాష్పపూర్ణము లయ్యెను. కొంతసే పుభయులు నిశ్శబ్దముగానుండిరి.

తుదకు హేమలత కొంచెముగంభీర స్వరముతో నిట్లనెను; “నరేంద్రా, ఇంకొకసంగతి: మనసులో పెట్టుకొనవద్దు, నాపయిదోష మెంచవద్దు నరేంద్రా, మనవీడుకోలుసమయమున ప్రేమచిహ్నముగా నీవు నాకొకవస్తువు నిచ్చియుంటివి. దానినిధరించుటకు నాకిఁకనధికారములేదు. నరేంద్రా, నీవు దానిని ప్రతిగ్రహింపుము.”

హేమలత తనహస్తము మీఁద వస్త్రమును తొలఁగించెను; నరేంద్రుఁడు పెట్టిన మాధవీకంకణ మింకను చేతిపైనుండెను తీఁగె యెండిపోయి ముక్క లయ్యెను; కాని హేమ ఆఖండములను దారముతోఁ గట్టెను. నేఁడామె దానిని చేతికి బెట్టుకొనివచ్చినది.

ఇరువురకును వెనుకటిసంతులు జ్ఞప్తికి రాఁజొచ్చెను, ఇరువురహృదయములు, విషాదచ్ఛాయాచ్ఛన్నములయ్యెను. కొంతసేపు వారు నిశ్శబ్దముగానుండిరి. హేమలతయొక్క చక్కనిచేతులను మాధవీకంకణమును నరేంద్రుఁడు చూడసాగెను; చూడఁజూడ, నాతని నేత్రము లశ్రుపూర్ణము లయ్యెను. ఇంకనతని కేమియుఁ గానఁబడలేదు తుదకు, దరవిగళితబాష్పధారలు హేమలత హస్తములను దడిపెను. చివరకు నరేంద్రుఁడు నిట్టూర్పువిడిచి “హేమా, ఈజన్మములో నీవు నన్నిఁక మఱచిపోవుదువా?” అనెను.

“బ్రతికియుండఁగానిన్ను మరచిపోను. ఎల్లకాలము అన్నవలెనిన్ను, నీసంగతులను దలఁతును. ఇదిగో, యీకంకణము ప్రేమసూచకముగా నాకిచ్చినావు. నరేంద్రా, ఆప్రేమకు నాకు హక్కులేదు. మనఃక్లేశముగా నెంచవద్దు. కొన్ని సంవత్సర

ఛాయానతిచొప్పున షీష్‌మహల్ ప్రవేశించెను. అక్కడ నింకొకవింత కానఁబడెను. ఖానుషాబేగముల జలక్రీడకొఱకు మీనమహలు నిర్మింపఁబడినది. చలువరాతిచే పఱచిన కుట్టిమముమీఁదుగా నిర్మలోదకము ప్రవహించుచుండెను [illegible] చెక్కఁబడినరూపములు చూచినచో నీటిక్రింద నెన్నో మత్స్యములు క్రీడించుచున్నట్లుండెను. నా[illegible] వైపుల కేళాకూళులలోనుండి [illegible] సన్నముగా లేచుచు, ముత్తెముల [illegible] రాలుచుండెను. గోకప్పునుండి వ్రేలాడుచున్న వివిధవర్ణదీపములు తమకాంతిచే కుల్యాయినీటిని మిలమిలలాడించుచుండెను. నాలుగువైపుల నెన్నో దర్పణములు రత్నఖచితములై గోడలకు బిగించియుండెను. విలాసలోలుపలగు బేగములు మందిరమున జలకేళి సలుపుటకై నానాదేశములనుండి బహుపదార్థములు తెప్పించి యాయపూర్వభవనమును పాదుషా నిర్మించెను.

నానాప్రదేశములనుండి హిందూముసల్మాను రమణులా నేఁడంతఃపురమున సమావేశమైనారు. వారిలోఁ జాలమంది షీష్‌మహల్ శోభను విలోకించుచుండిరి. జలేఖా నరేంద్రుని చెయ్యి పట్టుకొని వారి నడుగుగా నొకవైపునకుఁ గొని పోయి, యచ్చటియద్దమున నతని కొక ప్రతిబింబమును జూపెను. నరేంద్రుఁ డులికిపడి, భ్రాంతిపడి, యాఛాయను జూచుచుండెను. కాంతిచే నాకృష్టమైన పతంగమువలె నాతఁడా ప్రతిబింబమువంకనే నిష్పందదృష్టితో వీక్షించుచుండెను. కొంచెము సేపటికి నాతనిశరీరము వణఁకఁజొచ్చెను, హృదయము దడదడఁ గొట్టుకొనెను. ఇంతలో నా ప్రతిబింబ మదృశ్యమయ్యెను. అద్దమునఁ గానవచ్చిన రమణి షీష్‌మహల్‌నుండి వెడలిపోయెను. ఉన్మత్తప్రాయుఁడైన నరేంద్రుఁడు ఆమెవెంటనే చనెను. ఆమె రాజపుత్రస్త్రీవేషము ధరించియుండెను. ఆమెను బాగుగాఁ జూచుటకై నరేంద్రుఁడు దగ్గఱకుఁ బోయినను ఆమె యనావృతహస్తముతప్ప మఱేమియుఁ గానరాలేదు, మేలిముసుఁగులో నుండుటచే ముఖమండలము కానఁబడలేదు.

అద్దములో నగపడిన స్త్రీనామమును, నివాసమును నరేంద్రుఁడు స్త్రీవేషముతోనే అడుగదలచెను, కాని యతనినోట మాటరాలేదు; ఆమెహస్తమును బట్టుకొనఁ గోరినను చేయిరాలేదు. అతనిగుండెలు దడదడఁ గొట్టుకొనసాగెను. ఆమె రాజపుత్రస్త్రీలతో నాబజారునుండి [illegible] పలువెడలెను. నరేంద్రుఁడామె వెంటనే [illegible]నెను; ఎన్నోయిళ్ళు, వాకిళ్ళు, తోఁటలు, [illegible]లు దాటిపోయెను, ఒకచోట చాలమేనా లున్నవి. రాజపుత్రకామినులు తమతమ మేనాలలో నెక్కిరి. ఆమెయు నొకమేనా [illegible] నెక్కుట నరేంద్రుఁడు చూచెను. ఇదివఱ కామె యమునానదిని, ఆగ్రాలోని యంతఃపురమునను జూచినట్లు లేదు. కటిక నెక్కునప్పుడామె నడుమొంకను, ప్రాసాదము వంకను స్థిరదృష్టితోఁ జూచెను. యమునామారుతమున నామె మేలిముసుఁగు కదలెను. తీవ్రదృష్టితో నరేంద్రుఁ డామెవైపుఁ జూచెను. అతనిహృదయము స్ఫీత మయ్యెను. ఆమె యవగుంఠనము తొలఁగి పోలేదు. నరేంద్రుని కామెముఖము కానఁబడలేదు. రాజపుత్రవేషధారిణి మేనా యెక్కి త్వరలో వెడలి పోయెను.

ఆమె హేమలతా! అదే తీరు, అదే నడక, అవే బాహువులు! సుధామయ మగు నామె ముఖ మద్దములోఁ బ్రతిఫలించినది. కాని, హేమలత ఆగ్రాలో బేగం మహలులోని కెట్లువచ్చినది? రాజపుత్రాంగనా వేష మెందుకు?

## ౨౮

వీరనగర జమీందారుని పెద్దకోట ప్రక్క సుందరమైన యుపవన ముండెను. ఆవనముగుండ నదీతీరమునకు వెళ్ళవచ్చును. అందు బాల్యమున హేమలతా నరేంద్రులు ఆటలాడిరి ఇప్పుడా స్థితియంతయు మాఱియున్నది. నరేంద్రుఁడు శాంతివిహీనహృదయముతో దేశములవెంటఁదిరుగుచున్నాఁడు. మామగారు మృతినొందుటచే శ్రీశచంద్రుఁడిప్పుడు జమీందారు. హేమలత యిప్పుడు బాలిక కాదు, క్రొత్తజమీందారు గృహిణి.

సాయంకాలమున నాయుపవనము గుండె నిద్దఱు స్త్రీలు ఘట్టమునకు బోవుచుండిరి. అందొకతె హేమలత, రెండవయామె శైవలిని. హేమలతకిప్పుడు పదునైదేండ్లు ఉండవచ్చును. అతన్వంగి దేహము కోమలము, నుజ్జ్వలము నైయుండెను. ఆమె నయనములు జ్యోతిర్మయములు, కనుబొమలు నిగనిగలాడుచుండెను; గండస్థల మారక్త

ము, ముఖమండల ముజ్జ్వలము లావణ్యోపేతము నయి యుండె. అయినను, యౌవనప్రారంభమున నుండు ప్రఫుల్లత యామె యవయవములందు, గానవచ్చుట లేదు! యౌవనోన్మత్తత ముఖమండలమున గాన్పించుట లేదు; మీదుమిక్కిలి ఆమె వదనము చింతాముద్రితమై యుండెను. శైవలిని కిరువదియైదు వత్సరములు. యువతి యయినను నామె యవయవముల యందు యౌవనము కానవచ్చుట లేదు; అనిర్వచనీయమైన పవిత్రకాంతి దృగ్గోచర మగుచుండెను. శైవలిని హేమలతను చెల్లెలివలె ప్రేమించుచుండెను; స్నేహవాక్యములతో కథలు చెప్పుచు ఘట్టమునకు బోవుచుండెను. శైవలిని జీవితము మేఘశూన్యమగు సాయంకాలమువలె గంభీరము, శాంతము నైయుండె. బాల్యకాలమున హేమలత నరేంద్రుని జూచి సంతోషించుచుండెను. యౌవనప్రారంభమున నరేంద్రుడు తనహృదయము నాక్రమించె నని యామెకు దెలియదు. నరేంద్రునితో శాశ్వత వియోగము సంభవించి తా నింకొకని భార్యయైన నరేంద్రుని మూర్తిని హృదయమునుండి విసర్జింప వలసి వచ్చినపుడు హేమలత ప్రేమతత్త్వమును గ్రహింప గలిగెను. మర్మభేది యగు దుఃఖ మామె హృదయమును భేదింపసాగెను. ఆమె సరళహృదయ నవోఢ ఈవిషయ మెవరితో జెప్పును? ఎవరికి తనదుఃఖము దెలుపును! అయిదవయేటనే శైవలిని వితంతు వాయెను. ఆమె యత్తవారి యింటనే యుండి, అప్పుడప్పుడు తమ్ముని జూచిపోవుచుండెను. శైవలినిది కుశాగ్రబుద్ధి. రెండుమూడు పర్యాయములు వీరనగరము వచ్చి పిమ్మట నామె హేమలత మనోభావమును కొంచెము కొంచెముగా గ్రహింప గలిగెను. ప్రయత్నము చేసి చూడక పోయిన పక్షమున తమ్మునిసంసారము చెడిపోవు నని తలచి యామె వీరనగరమున నివసింప జొచ్చెను.

శైవలినియొక్క సస్నేహపరివర్తనము చేతను, ప్రబోధవాక్యములచేతను హేమలత దుఃఖ భారము కొంచెము తగ్గినది. శైవలినికి మానవచరిత్ర మెక్కువగా తెలియును. హేమలత నామెయొక శిష్యయైనను తిరస్కరింపలేదు; చెల్లెలినివలె మంచి మాటలతో నూరడించుచుండును. సారగర్భితములు స్నేహపూర్ణములు నగు శైవలినికథలు విన్నచో నెవరిదుఃఖము దూరముగా తొలగిపోవదు! కథలు చెప్పుటలో శైవలినికి నేర్పుగలదు. ఆమె హేమలతకు పురాణకథలు చెప్పుచుండెడిది.

శైవలిని సహవాసముచేత క్రమముగా హేమలతకు శాంతి కలిగెను. ప్రథమప్రణయరూపమైన కంటకమును హేమలత తనహృదయమునుండి లాగివైచెను. కాని, క్లేశముచే లావణ్యము తగ్గిపోయెను, దేహము శుష్కించెను. హేమలతకిప్పుడు దుఃఖము లేదు, కాని స్వభావము శాంతము, గంభీరము నయినది.

ఘట్టమునకు బోవుచు వారిరువురు నరేంద్రుని గురించి మాటలాడుచుండిరి. హేమలత నరేంద్రుని చిన్నప్పటినుండియు సన్నిహితునివలె నెంచుచుండెను. సోదరునకు కష్టమువచ్చినప్పుడు, వార్త తెలియనప్పుడు చెల్లెలికి విచారము గలుగును. హేమలత నరేంద్రునిగూర్చి చింతించుచుండును; కాని పూర్వమువలె ఆమె హృదయము చెదరిపోవుటలేదు. సాయంకాలమునందు ఉపవనమున నొంటరిగా విచరించుచుండ హేమలతకు చిన్ననాటిసంగతులు జ్ఞప్తికివచ్చును; భాగీరథీకలకల నినాదము విన్నప్పుడు, నీలాంబరమున పూర్ణచంద్రుని జూచినప్పుడు నామెకు చిన్ననాటి చెలికాడు జ్ఞప్తికివచ్చును. అప్పుడామె కంట బాష్పకణము కానవచ్చును. అది భ్రాతృస్నేహమునకు నిదర్శన మనియెంచవలెను. పరభావము తిరోహిత మగుటకయి హేమలత యెంతో యత్నము చేసినది, ఎంతో సహించినది, చాలదుఃఖించినది; అన్యభావము తిరోహితమయినది. కాని, హృత్కందరమున నామెకు దెలియకుండ లేశమాత్రమయిన పరభావము దాగియున్న పక్షమునను, పాపము, హేమలత కుమార్గురాలే!

౨౯

ఘట్టమునుండి మరలి వచ్చి వారిద్దఱు గృహకార్యములు ముగించిరి. తరువాత వారొకగదిలో గూరుచుండిరి.

"వదినా, కథలు విని చాల కాల మయినది. నేడొక యవసరము వచ్చినది. ఒక కథ చెప్పవా?" అని హేమలత పలికెను.

"చెప్పుదును-అభ్యంతరము లేదు. ఏ కథ చెప్పుమందువు?" అని శైవలిని సస్నేహముగా పలికెను.

"హరిశ్చంద్రమహారాజు కథ విని ఎన్నాళ్ళో అయినది. ఆ కథచెప్పు."

శైవలిని హరిశ్చంద్రునికథ చెప్పనారంభించెను. మహాభారతకథ నిజముగా అమృత తుల్యము. అందలి యుపాఖ్యానములు ఎంత లలితములు ఎంతహృదయంగమములు! రాజు రాజ్యము పోయెను, ధనము నశించెను, గౌరవము పోయెను; భార్యాపుత్రులను వెంటఁబెట్టుకొని యతఁడు విపినములందు విచరింపఁ జొచ్చెను. పట్టపుదేవి (చంద్రమతి) శైబ్యమాత్రము మిగిలినది. సుఖసమయమున రమణి చంచలచిత్త, మానిని; ఎంతో అభిమానము చూపును, మిధ్యాకోపము నటించును. కాని జీవనాకాశము మేఘాచ్ఛాదిత మయినపుడు, ప్రపంచ సుఖము లన్నియు నాటకాంతమున నాట్యశాలలోని దీపములవలె నొక్కొక్కటిగా నారిపోవునప్పుడు ఆశ మరీచికారూపమున నానాదిశల కీడ్చియాడ్చి తుదకు మరుభూమికిఁ గొనిపోయి యదృశ్యమయినపుడు, బంధువులు త్యజించినప్పుడు, లక్ష్మి విముఖతనొందినప్పుడు, స్త్రీవలె నెవరు శుశ్రూషచేయుదురు? స్త్రీప్రేమ అగాధము, అప్రమేయము! దరిద్రావస్థయందు, కష్టములందు హరిశ్చంద్రునకు శైబ్య సేవ చేయుచుండెను. ఆకష్టకథను విన హేమలత కన్నుల నీరు గ్రమ్మెను.

అటు తరువాత నింకను కష్టములు. రాజు శైబ్యను, కుమారుని విక్రయించెను; తన్ను చండాలున కమ్ముకొనెను. మందభాగ్య యగు శైబ్య భర్తృవియోగముతోను, శరీరక్లేశముతోను పుత్రుని బోషించుచుండెను. పాప మా పుత్రుఁడకాల మరణము నొందెను. హేమలత దుఃఖము నాపుకొనలేక, వదినరొమ్ముపై తలవాల్చి పెద్దపెట్టున రోదనము చేసెను.

కథ సమాప్త మగుచుండెను. హరిశ్చంద్రుఁడు భార్యాపుత్రులను మరల బొందెను; రాజ్యము సమస్తసంపదలు మరల నతనికి లభించెను. హేమలత హృదయము శాంతి నొందెను. ఇంచుమించుగా నొకగడియసే పిరువురు నిశ్శబ్దముగా నుండిరి. తరువాత హేమలత మెల్లమెల్లన లేచి కిటికీ తెఱచెను. చంద్రకాంతిచే భూమి యుద్దీప్తమై యుండెను; నిశావాతమున వృక్షములు మెల్లమెల్లన తల లాడించుచుండెను. దూరమున గంగా కలకల నినాదము విన వచ్చుచుండెను.

శైవలిని నెమ్మదిగా హేమలత దగ్గఱకువచ్చి సోదరివలె సస్నేహముగా చేయిపట్టుకొనెను. హేమలత యిట్లు తలపోయుచుండెను: "ఈచెట్లయాకులలోఁ గనఁబడు మిణుగురుపురుగులకు సుఖదుఃఖములు కలవు, ఆశకలదు, ఇచ్ఛకలదు. హరిశ్చంద్రమహారాజును కష్టములనుండి ఉద్ధరించిన భగవంతుఁడు ఈరాత్రివేళ ఈపురుగులకు ఆహారము నిచ్చుచున్నాఁడు, కోర్కెలు తీర్చుచున్నాఁడు. విశాలమైన యీలోకమందలి సకలజీవజంతువులను ఆయనసే రక్షించుచున్నాఁడు. భక్తితో ఆయనను పూజించెదను."

తరువాత హేమలత బాలికోచితమైన సరళతతో నిట్లనెను: "వదినా, దయాసముద్రుఁడు భగవంతుఁడు నిన్ను చిన్నతనమునసే అనాథను చేసినాఁడేమి!"

"అందఱికి అన్ని సుఖములు వ్రాసిపెట్టియుండునా? ఆయన నన్ననాథను చేసినాడు, కాని దుఃఖపరవశను చేయలేదు. దేవతుల్యుఁడగు సోదరుని, నీవంటి సుశీలయగు మఱదలిని దయచేసినాఁడు. బంగారువంటి యీసంసారమున నాకు తావిచ్చినాఁడు. నాకు మఱేమి కోరికలులేవు; కాని ఒక్కసారి తీర్థయాత్రచేసి, దేవపూజ చేయవలెనను కోరికమాత్ర మున్నది."

"మనము కాశీబృందావనము వెళ్ళుట స్థిరము కాలేదా?"

"అయినది. శ్రీశుఁడు నాబలవంతముమీఁద సమ్మతించినాఁడు. త్వరలోనే ప్రయాణము సాగునని తోఁచుచున్నది."

"వదినా, తీర్థయాత్ర నాకుమిక్కిలి సంతోషకరము. కొన్ని దేశములు చూడవచ్చును, కొన్ని తీర్థములు సేవించవచ్చును. నరేంద్రుఁడు పశ్చిమమున నున్నాఁడని తెలియవచ్చినది. వీలున్న అతనినిగూడ చూడవచ్చును."

"చూడవచ్చును."

ఇంతలో శ్రీశచంద్రుఁడు లోపలికివచ్చెను. శైవలిని ఒకప్రక్కగా బయటికిఁబోయెను. ఆమె ముఖము చింతారేఖాంకితమై యుండెను.

శైవలిని చింతయేమి? ఆమెయిట్లు భావించుచుండెను: "హేమా, నన్ను నీవు అనాథయనియు, దురదృష్టవంతురాలనియుఁ దలఁచితివి. కాని, స్త్రీలలో నెవ్వరును సహింపని కష్టము నీవు సహించితివి. ఆవెచ్చను నీగుండె తల్లడిల్లినది, నీజీవి

త మించి పోయినది. ఈవయస్సున దుర్బలముగా నున్న నీశరీరమును, ఎండిపోయిన పెదవులను జూచిన గుండె అదరుచున్నది. నీవిచారము మావాని కెంతమాత్రము తెలియదు నీవు చిన్నదానవు. నీ విచారము తొలఁగిపోయినదని తలఁచుచున్నావు. కాని, నరేంద్రుని ఒకసారిమాచిన పక్షమున ఏ మగునో తెలియదు. భగవంతుఁడు, అనాథనాథుఁడు అసహాయులకు సహాయుఁడగును గాక!"

## ౩౦

శైవలిని మరల గృహములోని కరుదెంచి, సోదరుని పీటపైఁ గూరుచుండఁ జేసి, వడ్డించి, తను ప్రక్కగా నిలిచి వీవనతో విసరుచుండెను. హేమలత ఆయింటినుండి బయటికి వచ్చి, గుమ్మముపక్క నిలిచి భర్త భుజించుట చూచుచుండెను.

అక్కా తమ్ములకు చాలసేపు సంభాషణ జరిగెను. శ్రీశచంద్రుని భోజన మాయెను. చాల రాత్రి యగుటచే నతఁడు శయనింప నుద్యమించెను. శైవలిని వేఱొకగదిలోనికిఁ బోయెను.

అంతట హేమలత నెమ్మదిగా భర్తదగ్గరకు వచ్చి, వినయముతో తాంబూల మిచ్చెను. నేఁడు శ్రీశుని హృదయ మహ్లాదితమై యున్నది; అతఁడు సంతోషము మరుఁగుపరచి, 'తాంబూలము వేసికోను' అని పలికెను.

"ఎందుచేత?"

"నీ నోటివెంట మాటలు రావెందుచేత?"

"ఎంతకాల మీ శుష్క ముఖమును చూతును? ఎప్పుడు నీశరీరము కొంచెము స్వస్థ మగును? ఎప్పుడు నీముఖము వికాసముగా నుండఁజూతును?

"నాశరీర మిప్పుడు స్వస్థముగానే యున్నది"

"అవును, ఈశ్వరానుగ్రహముచే శరీరము కొంచెము స్వస్థముగానున్నది. కాని, మనస్సులో ఉల్లాసమో?"

"ఉల్లాస మేమిటికి?"

"మనస్సు యొక్క వికాసము కాదా? నీవు సుఖముగా నుండఁగా ఎప్పుడు చూతును?"

"నాకు మనఃక్లేశము లేదు. కాని, వదినచెప్పిన విచారకరమైన కథ వినుటచేత కన్నీటిబొట్టు రాలినది."

శ్రీశుఁడీ మాటలకు సంతుష్టి నొందక "చిరునగవుతో నున్న నీముఖమెప్పుడు చూతును? అనెను.

హేమలత ప్రత్యుత్తర మీయలేక నేలవంకఁ జూచుచు, చప్పున నొకసంగతి జ్ఞప్తికివచ్చుటచే చిఱునవ్వు నవ్వి, "మీప్రతిజ్ఞ నెరవేర్చినప్పుడు" అని పలికెను.

"ఏమి ప్రతిజ్ఞ?"

"తీర్థయాత్ర."

శ్రీశచంద్రుఁడు కొంచెము సిగ్గు పడెను. శైవలినీహేమలతల బలవంతముచే నతఁడు తీర్థయాత్ర కెన్నోసారు లంగీకరించెను. కాని యింతవఱకెట్టి యత్నము చేయలేదు. నేఁడు హేమలతమాటకు కొంచె మూరకుండి, "యథార్థముగా తీర్థయాత్ర చేయుటవలన నీశరీరము, మనస్సు స్వస్థతఁ బొందు పక్షమున తప్పక పోవుదము. ఇప్పటినుండియే నేను యాత్రకు వలయుయత్నము చేసెదను" అని యతఁడు పలికెను.

హేమలత సంతృప్తిఁ బొందెను; ఆమెముఖ మించుక ప్రఫుల్లమగుటఁ గాంచి, శ్రీశుఁడానందించి, ఆక్షీణతనూలతను హృదయమునఁ జేర్చుకొని, సస్నేహముగా ముద్దాడెను.

పక్షముమునకు తరువాత కొద్దిరోజులకే శ్రీశచంద్రుఁడు తీర్థసేవకై సపరివారముగా బయలుదేఱెను. గంగాతీరమున నుండు తీర్థముల నెల్లసేవించి తుదకు మధురాబృందావనముల నకు బోవునూహతో వారు ఆగ్రాచేరిరి. అచ్చట శ్రీశచంద్రుఁడు ప్రముఖులగు హిందూరాజులతో సంభాషించెను. అందులోనొకప్రభువు బలవంతముచే నతఁడు తన కుటుంబమును ఆరాజకుటుంబముతో నొరోజు పండుగనాఁడు ప్రాసాదమునకుఁ బంపవలసెను. విధిలేక, హేమలత రాజపుత్రాంగనా వేషము ధరించి, రాజపుత్రస్త్రీలతో ఆగ్రాయందలిబేగమ్మమహలుకు వెళ్ళెను.

## ౩౧

నరేంద్రుఁడు ఆగ్రాదుర్గమున నొకయుద్ధములో హేమలతాముఖచ్ఛవిని విలోకించి, యించుమించుగా మతిఁ గోల్పోయెనని యిదివరకే చెప్పియున్నాము. చాలతడవు శాంతనభము దెసను శాంతప్రవాహమువంకను జూచుచు మెల్లగా నతఁడు తనబసకుఁ బోయెను.

 

నరేంద్రుఁడింటిలోఁ బ్రవేశించెను. అప్పుడు దీపమొకటి వెలుగుచుండెను. జనులెవ్వరు లేరు. నరేంద్రుఁడు తలుపుమూసి స్త్రీవేషము తీసివేయుచుండఁగా చటుక్కున నాతని ఱొమ్మునుండి యొక కాగితము నేలపైఁ బడెను. అతఁడు దానిని పైకితీసి చూడఁగా నది ఉర్దూభాషలో లిఖింపఁబడి యుండెను. దీపముకడఁ గూరుచుండి యాకాగితము చదువనారంభించెను. ఎక్కువ దూరము చదువకమునుపే అది జులేఖా వ్రాసిన యుత్తరమని యతఁడు తెలిసికొనెను. అంతట నరేంద్రుఁడెంతో యాశ్చర్యపడి, యింకను జదువసాగెను. ఉత్తర మిట్లుండెను.

"నరేంద్రా, నేను వెఱ్ఱిదానను, నిర్భాగ్యురాలను, అందుచేతనే యీజాబు వ్రాసితిని. నా కన్నులకేమియుఁ గానఁబడుటలేదు; తల తిరుగుచున్నది. అయినను, మరణమునకు పూర్వమొక్కసారి మనసులోనిమాటలు మీకు చెప్పిపోయెద. మీరీయుత్తరము జదువునప్పటికి ఈదీనురాలీ లోకమున నుండదు!

"నేను షాహజహాన్ బాదుషాగారి పెద్దకూఁతురు జహనారాబేగముగారిపరిచారికను. కాశీయుద్ధమునాఁడు కార్యవశమున నేను మన్సూర్ అను కొజ్జావాఁడును జయసింహ మహారాజుగారి శిబిరమునందుంటిమి. గాయము తగిలి, అచేతనావస్థయందున్న మిమ్మప్పు డచ్చటికిఁ గొనివచ్చిరి. దర్శించి, ఆనాఁటినుండి హృదయమున కాలసర్పము ధరించితిని.

"ప్రతిదినము, ప్రతిసప్తాహము నేనీహాలాహలము పానముచేయుచుంటిని. నిరంతరము మీరోగశయ్యమీఁద వంగియుండుదానను; నిద్రావిహీనయై, నిద్రించుచున్న మీశరీరమును జూచుచుండుదానను; ఉన్నతలలాటమును రక్తవర్ణములగు పెదవులను విలోకించుచుందును. కొంచెమెచ్చుతగ్గుగా నేను పిచ్చిదాన నయితిని. రోగవశమున నెప్పుడయిన మీరు నన్నుఁ జూచి తిరస్కరించినప్పుడు లోలోన నిశ్శబ్దముగా దుఃఖింతును; జబ్బులో నెన్నఁడయిన మీరు సస్నేహముగా నాహస్తము పట్టుకొన్నప్పుడు నాశరీరము పులకరింప వెఱ్ఱిదాన నయిపోవుదును. ఇంటిలో నెవ్వరును లేనప్పుడు నే నావేశములో మిమ్ము ముద్దుపెట్టుకొనుచుందును. క్షమింపుఁడు, నేను పిచ్చిదానను!

"క్రమముగా కాశీనుండి పడవలో మిమ్ము ఢిల్లీనగరమునకుఁ గొనివచ్చిరి. ఉపాయముగా మిమ్ము నేను రాజభవనములోనికిఁ దీసికొనిపోయి ఆ గదిలోనుంచితిని. కేవలము మిమ్ముఁ జూచుచుండుటకే ఆయింట నుంచితిని. మీముఖమును వీక్షింపవీక్షించి, రాత్రి గడపుచుండుదానను. మనసు నిలుపుకొనలేక అచేతనముగానున్న మీశరీరమును అప్పుడప్పుడు నాహృదయమున [illegible]చుండుదానను.

"దుర్మార్గుఁడు మన్సూర్ నీసంగతి బేగము సాహెబాకుఁ దెలియఁజేసెను. అంతఃపురములోనికి మగవానిని గొనివచ్చితినని విని యామె మనకిరువురకును ప్రాణదండన విధించెను. సరలబేగము సాహెబాకాళను మీపరాక్రమమును చక్కదనమును దెలిపెను. బేగము వెనుకటియాజ్ఞ రద్దుచేసి, నన్ను చెఱసాలయందుంచి, మీకారోగ్యము కలిగిన తరువాత మనలను స్వయముగా విచారణ చేయునట్లు నియమించెను.

నేను చెఱలో వేయఁబడి యొంటరిగానుంటిని. మిమ్ముఁ జూడకుండుటచే నాకసహ్యవేదన కలుగుచుండెను. సహింపలేక, తుదకు ద్వారరక్షకులను మన్సూరును మంచిచేసికొని, రహస్యముగా మిమ్ముఁ గాంచి పోవుచుండుదానను. మీకు స్వస్థత కలిగి, అప్పుడప్పుడు మీరు నావైపు చూచుట జ్ఞప్తియందున్నదా? నే నెక్కువసేపు నిలుచుటకు వీలులేకుండెను, మాటలాడుటకును వీలులేకుండెను. కఠినుఁడు మన్సూరు శీఘ్రముగా నన్ను బంధనశాలకుఁ బంపెడివాఁడు. అచ్చటికేగి, మీ దివ్యమూర్తినిగూర్చి చింతించుచుందును.

"క్రమక్రమముగా విచారణరోజు వచ్చెను. ఆరోజు మీకు జ్ఞాపకమున్నదా! సింహాసనముమీఁదఁ గూరుచున్న జహనారాకు నాలుగువైపుల సహచరీసమూహము నిలచియుండెను; అది మీకు జ్ఞప్తియందున్నదా? బేగంసాహెబా ఆరోజుననే మిమ్ముఁ జూచెను. ఆమె విధించినకఠిన శిక్ష జ్ఞాపకమున్నదా? ఓషాహజాది! నాపాపమునకిది తగినశిక్షయేనా? నీవుకూడ ఆడుదానవు నీహృదయముపాషాణమా! ఎప్పుడు సంచలింపలేదా? నేను ఖైదీని నాకు స్వాతంత్ర్యములేదు అందుచే నాపాపమునకు శిక్షవిధించితివి! నీవో,

సింహాసనముమీఁదఁ గూరుచుండు రాజపుత్రికవు; నాకంటెనీవు ఘోరపాపాత్మురాలవు: అందుకు శక్తి లేదా?

"ఏయుపాయములచే నేనారాత్రి దుర్గమునుండి పలాయనమైతినో వానిని దెలుప నవసరములేదు. అటుతరువాత సైనికవేషమున మీరు ఢిల్లీనగరము విడిచిపెట్టినారు. ఈదీనురాలు దివానా తార్తారబాలుని పేరు పెట్టుకొని, మీవెంటవచ్చినది. నరేంద్రా, మీప్రణయభాజనము నగుదునను నాశలేదు, దివారాత్రములు మీసన్నిధి నుందుననియును, దప్పిగొన్న చాతకమువలె మీముఖమును నిరీక్షించుచుందుననియు, పగలుమీ అమృతవాక్కుల నాలకింతుననియు రాత్రిరెండుజాముల వఱకు అప్పుడప్పుడు ప్రభాతమువఱకును నిద్రావస్థలో నున్న మిమ్ముఁ జూచుచు పిపాస తొలగించుకొందు ననియు కేవల మీయాశలతో నేను ఢిల్లీనగరమునుండి సిప్రాతీరమునకు, సిప్రానుండి రాజస్థానమునకు పయనము చేసితిని. ఈసుఖాశతో నీదీనురాలు పోవుటకు వెనుదీయు ప్రదేశము ప్రపంచమునగాని, నరకమునఁగాని యుండునా?"

## ౩౨

"నరేంద్రా, మిమ్ముఁ బ్రేమించితిని. మీప్రణయభాజనమైన హిందూయువతిని చూచితిని. మీరు ప్రేమకయి యున్మత్తత నొందలేదు నేను తార్తారదేశసంజాతను. అచ్చటివారికందఱికి నుగ్రభావము: నేనుగూడ చిన్నతనమునుండి యుగ్రస్వభావురాలను. నాకుఁగోపము వచ్చినప్పుడు బాలకులు సైతము ఆటవిడిచి, బాలికలకు దూరముగాఁ దొలఁగి పోవుదురు. ఒకయుద్ధమున నాతండ్రి మరణించెను. నేను బందీనై ఢిల్లీచక్రవర్తికి విక్రయింపఁబడితిని. స్వాతంత్ర్యము పోయెను; కాని ఉగ్రస్వభావము పోలేదు. భారతవర్షమున సూర్యతాపముచే నా రక్తముష్ణతర మయ్యెను. అంతఃపురమునతార్తారకన్యల కేమి పనియో మీకుఁ దెలియదు. మేము బేగముల మహాలులు రక్షింతుము. కత్తిని, చుఱకత్తిని పట్టుటలో నేర్పులేని వారము కాము. బేగముల యానతిచొప్పున నెన్నెన్ని భయంకర కార్యములు సమకూర్చితినో లోకము సాధారణముగా నెఱుఁగునా? నేనీ వ్యాపారములందు మునిఁగి తేలుచు, ఎవ్వరికిని సాధ్యము కాని పనులుగూడ, సాధించుచుంటిని. ఈనా నేర్పునకే సాహెబా నా యుగ్రస్వభావమును సహించుచుండెను.

"ఢిల్లీ విడిచి నేను మీవెంట వచ్చినపుడు నాస్వభావ మెంతమాత్రము మాఱలేదు: ఉన్మత్తనై మీతో వచ్చితిని.

"ఉదయపుర తటాకమున పడవలో సాయంకాలమున వెన్నెలలో విహరించుట జ్ఞప్తియం దున్నదా? మీ రెల్లప్పుడు విచారగ్రస్తులై యున్నట్లు కానఁబడుచుండెను; కాని మీ రేమి భావించుచుంటిరో నేను నిశ్చయింప లేకుంటిని. ఆనాఁడు పడవలో మీరు నాతొడపై తలమోపి పండుకొని చంద్రునివంకఁ జూచు చుండుట స్మృతియం దున్నదా? నే నాసమయమున చంద్రకిరణోజ్జ్వలమైన మీముఖమును జూచుచు, జుట్టు సవరించుచు, మీవ్రేలు పట్టుకొని క్రీడించుచుంటిని. అకస్మికముగ మీరు నిట్టూర్పువుచ్చి "హేమా, ఈ జన్మములో నిన్నిఁకఁ జూచుట తటస్థించునా!" అంటిరి. బాంగ్లాభాష నేను బాగుగా నెఱుఁగను: కాని యీవిషయము గ్రహించితిని. నామనస్సులో ననుమాన ముద్భవించెను.

"స్త్రీల మనస్సున అనుమాన ముదయించునేని శీఘ్రముగా నివృత్తము కానేరదు. మీ హేమనుగూర్చి తెలిసికొనుటకయి దివారాత్రము లుత్సుకముగా నుంటిని; మీ కాకితములను దొంగతనముగా చదువుచుంటిని; మాటపై మాట మీఁద వీరనగరవృత్తాంతము లన్నిటిని మీకడనుండి బయటికి లాగితిని. అంతట, హేమను మీహృదయమునుండి తొలఁగించి, ఆ స్థానము నేలుటకై నాహృదయము జ్వలింపఁ జొచ్చెను.

"హిందూధర్మమున మీనిష్ఠను గ్రహించి ఏకలింగ దేవాలయమున గోసాయీలకడ కభీష్టసిద్ధికై పోయినాను. మొదట నేను దర్శించిన యతఁడు పరమధార్మికుఁడు; నాప్రస్తావన నంతయు విని నన్ను వెడలఁ గొట్టెను. ఈవిధముగా ముగ్గురు నలుగురచే నవమానితనై తుదకు శైవశ్వరునియొద్ద కేగితిని. ఆయన పెద్దలంచమునకే సమ్మతించెను. తోడనే నేను మూడువందల ముద్రల వెలగల వజ్రవలయము నాయన చేతనిడి వేయి ముద్రల విలువకల ముక్తాహారమును

గదలించుచు నిట్లంటివి: "ధనమునకో బలమునకో, కౌశలమునకో మీరు హేనులత తలంపును, నరేంద్రుఁడు విడుచునట్లు చేసి, మున ల్మానుధర్మము నవలంబించు లాగువసేసి, నన్నుఁ బరిగ్రహించునట్టి సర్విత లేని యెడల నీ యుద్దపుదండను నాచేతులతో మీమెడ నుంచెదను.'

"ఇంతధనమెక్కడ లభించెనని మీరు ప్రశ్నింతురు. జహానారాబేగము సాహెబాగారి సేవ యందుండువారికి ధనాభావములేదు. దేశములోని పెద్దవారు పాదుషాకు విన్నపము చేయవలె నన్నను బేగముసాహెబా గారిని జూచవలెను. రిక్తహస్తముతో రాదు. ఉన్నతోద్యోగముల కొఱకు కొందఱు, ప్రజలను పీడించినవాని క్షమాపణకై కొంత మంది, పరుల భాగము సంగ్రహించి సనదులు పొందుటకై కొంత మంది యుద్ధమున నోడిన యోధుని క్షమాపణకు కొందఱు, పాదుషాకు తమపై కలిగిన యకారణ క్రోధనివారణకు కొందఱు ధనము, ముత్యములు, వజ్రములు బేగముసాహెబాగారి సన్నిధికిఁ బంపి తమతమ విన్నపముల నెఱింగించుచుందురు. పరిచారికలకుఁగూడ లంచము ముట్టకపోదు.

"అటుపిమ్మట నైశ్వర్యము నవలంబించిన యుపాయములను మీ రెఱుఁగుదురు. ఆ యుపాయములు విఫలములయ్యెను, నా యాశ లడుగంటెను. రెండు సారులు నిజవేషముతో గుహ యొద్దకు వచ్చితిని. మీరు మద్యపానోన్మత్తులై యుంటిరి: నన్నుఁ జూచితిరో లేదో తెలియదు. మొదటినాఁడు మీచరణోపాంతమునఁ బడి, రోదనము చేసితిని; రెండవనాఁడు మీ ప్రాణమునకై యత్నించి యుద్యుక్తురాల నయితిని. చేతినుండి కత్తి జారి పడెను. తాగ్గార హస్తమునుండి కత్తి జాఱిపోయెనన్న దెఱుఁగను: సాక్షిణతయు నెఱుఁగను.

"పిమ్మట మీతో మరల ఆగ్రాకు వచ్చితిని విచారింపఁగా, వంగదేశమునుండి ధనాఢ్యుఁడగు జమీందారొకఁడు వచ్చెనని తెలిసినది. నీ హేమను జూచినాను. పాపిష్ఠా, పరస్త్రీ హేమ నీ దియా? ఊ! ఇంక యాతనసహింపలేకపోతిని. మధురలో గోలకనాథుని మందిరమునకు జాముగాత్రి యయినపిమ్మటఁ బొమ్ము; పరస్త్రీని మరలఁ జూడుము! నీవు నన్ను నిర్భాగ్యురాలను జేసితివి: నిన్ను నేను నిర్భాగ్యుని జేసెదను; అందుకే యీపత్రికాంతము పంపినాను, అందుకే ఆగ్రాదుర్గమునకుఁ బోయి హేమలతను జూచినాను!

"నాకు మరణము సమీపించినది. అయినను ప్రతీకారము చేయుట తాగ్గారధర్మము. నేను స్వధర్మమును మరచిపోలేదు, నా రక్తము శీతలించలేదు.

"ఊ! నాతల తిరుగుచున్నది. ఈ తృష్ణాగ్నిని హేమవారి దానమునొసఁగుచో ముసల్మాన్ స్త్రీ కృతఘ్నురాలు కానేరదు. జీవితమున్నంతవఱకు కాని, ఆసంగతి కలన నేమిలాభము? నరేంద్రా, నాకీజన్మమునకు సెలవిమ్ము! మరణానంతర మొకపర్యాయము దర్శనమగునేని ఓకరింపుఁడా, ఈ హృదయమును ఛేదించి, అంతర్భాగమును నీకుఁ జూపెదను. నరేంద్రా, అప్పుడు నీవు నన్ను ప్రేమింతువు; ప్రేమింపనిచో ఈ చురకత్తితో నీపాషాణహృదయమును ఛేదించెదను!— ఉన్మాదిని జలేఖా."

ప్రతికాపఠనము ముగిసెను. నరేంద్రుని నేత్రములనుండి బాష్పకణములు రాలెను. నిశ్శబ్దముగా నేమో చింతించుచు నతఁడు వెలుపలికిఁ జనెను. ఇంచుమించుగా తెల్లవాఱవచ్చుచుండెను. నగరము శాంతముగా నుండెను. నరేంద్రుఁడు కాలినడకను చాలదూరము పోవఁగా నెదుట యమునానది కానఁబడెను.

నిట్టూర్పు విడిచి యతఁడు మరలిపోవ నెంచుచుండఁగా యమునాతీరమున కొందఱు జనులు గుమిగూడి యొకశవమును పాతిపెట్టుచుండిరి. నరేంద్రుఁడు ప్రశ్నచేయఁగా వారిలో నొకఁ డిట్లు పలికెను: "మరణము నొందిన స్త్రీ పూర్వము బేగముమహాలులో నొకదాసి. ఒక కాఫరు సైనికునితో వ్యభిచరించి, లేచిపోయెను. అతఁడీమెనిప్పుడు వధించినట్లు తోఁచుచున్నది. దాని రొమ్మున నీవాడిచురకత్తిచూచినాను. దౌర్భాగ్యురాలి పేరు జలేఖా."

33

శాంతముగాఁ బ్రవహించు యమునాకూలమున సాయంసమయమున మధురానగరము సుందరముగాఁ గానఁబడుచుండెను. సూర్యుఁడస్తమించి చాలసేపాయెను; ఆకసమున నొక్కటొక్కటిగా నక్షత్రము లుదయించుచుండెను.

సాంధ్యవాయువు మెలమెల్లన యమునావిశాలవ

తమామీఁదుగా వీచుచుండెను. జగము శీతలము శాంతము నై యుండె. పాషాణములతోఁ గట్టిన సోపానములు నీటిలోనికి దిగియుండెను; వృక్షముల లతాగృహములు సంఘమునుండి నేత్రగోచర మగుచుండెను.

క్రమక్రమముగా ప్రొద్దుపోవుచుండెను. హేమంతకాల చంద్రికలో నదీనగర వృక్షమంది రాదు లతిమనోహరముగా నుండె. నీలాంబరమున సుధాంశుఁడు మందముగా తేలిపోవుచున్నట్లుండెను. నదీగర్భమున నొకటిరెండుపడవలు తేలియాడుచుండెను. నది కిరువంకల సాంద్రనీలవృక్ష శ్రేణికలదు. చంద్రుని సుధావర్షముచే లోకమంతయు తృప్తినొంది, సుఖముగా నిద్రించుచున్నలాగున బోధపడుచుండెను.

ఇంతలో సాయంసమయ పూజ యారంభమయ్యెను; అనేక దేవాలయములనుండి శంఖధ్వనులు ఘంటారవములును వినఁబడసాగెను. వాయు ప్రసారముచే బహుదూరమునుండి వినఁబడు నాధ్వని యెంతో మనోహరముగ నుండెను. ఆనుంటారవము మెల్లన నదీగర్భమునను పట్టణమున నల్వంకలను విస్తరిల్లి మందమందముగా ననంతనీ[illegible]కాశము నధిరోహింపఁ దొడఁగెను. అర్చకుల [illegible]మము లౌకికసేవ ప్రాపంచికచింత విస్మరించి ఆ పవిత్రఘంటారవముతో గగనముదెసఁ బరువు లెత్తఁ జొచ్చెను.

నదీతీరమున శిలాసోపానములమీఁద నున్న యొక దేవాలయమున హారతి యిచ్చుచుండిరి. బ్రాహ్మణు లనేకులు నర్చకులు నుచ్చైస్స్వరమున స్తవములు చేయుచుండిరి. యాత్రికులు నిలువఁబడియుండిరి. యాత్రకువచ్చిన వారిలో స్త్రీలు హెచ్చు; బహుదూరమునుండి నానాదేశములనుండివచ్చి యీపవిత్రస్థానమున గుమిగూడి, నేఁడు దేవుని సందర్శించి జీవితము ధన్యమయినట్లు భావించి నట్లుండిరి.

హారతియయ్యెను. యాత్ర చేయవచ్చినవారు తమతమ బసల కరిగిరి. ఇద్దరు స్త్రీలు మాత్రమా మందిర పార్శ్వమున నొకవృక్షతలమున నిలిచి సంభాషించుచుండిరి.

"వదినా, నేఁడు జాముప్రొద్దుపోయినతరువాత ఈ దేవాలయమున నరేంద్రుఁడుకనబడునని ముసల్మాన్ స్త్రీ చెప్పినది. అట్లుకాలేదేమి?" అని హేమలత మందహాసముతో ననెను.

శైవలిని బుద్ధిమంతురాలు. హేమలత అమాటలు నవ్వుచుఁ బలికినను ఆమె హృదయము నేఁడు నిజముగా నుద్విగ్నమై యున్నదనియు, నరేంద్రుఁడు వచ్చునను నెడ యాశతో నామెగుండె దడదడ గొట్టుచున్నదనియు, శరీరము వణఁకుచున్నదనియు శైవలిని గ్రహింపఁగలిగెను.

"ఈరోజున నేమి యాడదున్నదో తెలియదు. హేమలతబాలికయే యనవచ్చును; నరేంద్రునిఁ జూచినచో మరల వెనుకటిసంగతులు జ్ఞప్తికి వచ్చును, ఆదుర్భరవేదన బాలిక సహింపఁగలదా?" అని తలఁచి శైవలినిపరిహాసముగా నిట్లనెను "ఆ పిచ్చిదాని మాటలునమ్ముదువా? నరేంద్రుఁడుఁ డెక్కడ! ఏదేశముననున్నాఁడో. అతని సమావేశము సంధ్యలో నెట్లు తటస్థించునని యాశపడుచున్నావు?"

"కాని, జలేఖామాటలు సరిగానున్నవి."

"ఈప్రకారముగానే వారలు నట్టియాశలు కలిగింతురు. రెండు నిజపుమాటలు చెప్పిన ఒకయసత్య వాక్య మవచ్చును. మనదాసి రాలేదేమి? నేను త్రోవ సరిగా గుర్తింపలేను; లేకున్న మనమిద్దఱమి[illegible]ఁ బోయియుందుము."

"చూడు వదినా! ఇది మనవీరనగరము, ఇది మన గంగానది అనిపించుచున్నది. చిన్నతనమున వెన్నెలలో గంగయొడ్డున నీతోను మతి- మతి- మతి- అందఱతోను ఆటలాడిన సంగతి జ్ఞప్తికి వచ్చుచున్నది."

శైవలిని ముఖము గాంభీర్యము వహించెను; దాసి వచ్చుటకు తడవగుచుండెనని యామె మిక్కుల నాతురముగా నుండెను. హేమలత యా సంగతి లక్ష్యపెట్టక మరల నిట్లు చెప్పసాగెను: "వదినా, అదిగో పడవ బాణవేగమున నెట్లువచ్చుచున్నదో చూడు; పల్లెవాండ్రు దృఢముగా తెడ్డువేయుచున్నారు. పడవ యెగిరి వచ్చుచున్నట్లున్నది."

శైవలిని యావైపు చూచెను; ఆమె భయము ద్విగుణిత మయ్యెను. ఆమె భయపడినట్లే జరిగెను, ఘట్టమునకు రెండుగజముల దూరమున పడవ నిలువఁగా నైనిరుఁ డొకఁ డందులోనుండి తీరమున దుమికెను. అతఁడు నరేంద్రుఁడు.

హేమలత చెట్టునీడలో నుండెను. నరేంద్రుఁడామెను జూడక దేవాలయములోని కరిగెను. హేమలతమాత్రము నరేంద్రునిఁ జూచినతోడనే

యుండెను. ముఖము పాలియున్నను, కన్నులలో కాంతి పూర్ణముగనే యుండెను. జలేఖా కోపముతో పెదవి కొఱికి నరేంద్రునివైపు దృష్టినిగిడ్చెను. ఆమె నడుమున చురకత్తికొన కానవచ్చుచుండెను. ఆమె విషాదగీతము పాడుచుండెనా? లేదనితోఁచుచుండెను.

నరేంద్రుని "రమ్ము!" అని పిలిచి యామె ముందు నడువసాగెను. చాలదూరము నడచిన పిమ్మట వారు దుర్గమునఁ బ్రవేశించి అంతఃపురమునందలి చీఁకటియింటిలోఁ జొచ్చిరి. అంతవఱకును నరేంద్రుఁడు కర్తవ్యమెఱుఁగక యామె వెంటఁ బోవుచుండెను. అక్కడమాత్రము నరేంద్రుఁడు సంశయించి "నీ వెవరో నాకు తెలియదు. అంతఃపురమునఁ బ్రవేశించుటకు నాకనుమతి లేదు" అని పలికెను.

"అంతఃపురములోనికి వెళ్ళుటకు నాకధికారము లేనిపక్షమున మిమ్ము రండని చెప్పను," అని జలేఖా చెప్పెను.

"నీ వెవరో నాకుఁ దెలియదు. తెలియనిచోటికి రాను."

"ప్రాణభయమా? మిమ్ము సంహరింపఁ దలఁచినచో తార్తారదేశీయము ఈ చురకత్తి నుపయోగింపకయుందునా? దీనిని తీసికొనుఁడు. వట్టిచేతుల దాని వెంటవచ్చుటకు వీరపురుషుల కేయాటంకముండదని తలఁచెదను!" అని కఠినస్వరమునఁ బలికి జలేఖా నవ్వెను.

కోపముచే నరేంద్రుని ముఖము ఎఱ్ఱవాఱెను. నిశ్శబ్దముగా నతఁడు జలేఖా వెంటఁ జనఁజొచ్చెను. కొంచెము దూరము పోయిన తరువాత నొకచోట నామె యతనికిఁ గొన్ని వస్త్రములు చూపి, కట్టుకొనుఁడనెను. వస్త్రములనతఁడు కదలించిచూడ నవి యాఁడుదానివి! ఆశ్చర్యపొంది యతఁడు జలేఖావంకఁ జూచెను. ఈసారి గంభీరస్వరముతో నిట్లనెను "ఆలస్యము చేయవద్దు. మనము వచ్చిన ద్వారము బిగిసినది. నాలుగు వైపులను కొజ్జాలు విచ్చుకత్తులతో నిలుచఁబడి యున్నారు. ఇది యొక బేగము మేడ. మీరు పురుషులని తెలిసినవెంటనే ప్రాణములు పోవును."

నరేంద్రుఁ డాశ్చర్యాన్వితుఁ డయ్యెను. జలేఖా చెప్పినదంతయు సత్యమే. గత్యంతరము లేక నరేంద్రుఁడు అవికతొడిగి, పటికిణీకట్టుకొనెను. జలేఖా నవ్వుచు నతని తలపై టోపీపెట్టెను. ఈయద్భుతవేషముతో నరేంద్రుఁడు జలేఖావెంటఁ జనెను.

నరేంద్రుఁ డామెవెనుక నడచుచుండెను. ఎన్ని యిండ్లు, ఎన్ని వాకిళ్ళు దాటిపోయినవో చెప్పవలనుపడదు. ప్రతిద్వారము కడను విచ్చుకత్తులతో కొజ్జావాండ్రు కావలియిచ్చుచుండిరి. ఎవరో పరిచారిక లిటునటుఁ దిరుగుచుండిరి. జలేఖను జూచి యందఱు తోవయిచ్చుచుండిరి.

అంతఃపురములోనికిఁ బోవుచున్న కొలఁది నరేంద్రుని కాశ్చర్యము హెచ్చఁజొచ్చెను. ఐశ్వర్యము, శిల్పము, విలాసప్రియత్వమును గాంచి యాతఁడు విస్మయుఁడయ్యెను. తెల్లరాతితోఁ గట్టినగవాక్షములను, కుట్టిమములను, స్తంభములను లెక్కించుటకు వీలులేకుండెను. అహో, రాతిపై నెంత శిల్పమున్నది; గోడలందు స్తంభములందు, ప్రకోష్ఠములందు, నానావిధవర్ణములుగల శిలలను లతాపత్రపుష్పరూపములు దాల్చునట్లు తాపుటచే నిజముగా లతలు గోడలప్రక్కఁ బ్రాకించి యున్నట్లు కానఁబడుచుండెను. ప్రసూనపరిమళముచే ప్రాసాదము గమగమలాడుచుండెను. శ్వేతపీతనీల వర్ణదీపములు సౌధము వెలుపలను లోపలను ప్రకాశించుచుండెను. అసామాన్యలావణ్యదేహలగు కొందఱు బేగము లిటునటుఁ దిరుగుచుండిరి. కొందఱు పువ్వులు కోసి, శిరమునందుంచుకొనుచుండిరి; కొందఱు మధురగానము సేయుచుండిరి. ఉత్సవదినమగుటచే ప్రాసాదము హర్షముతోను, నృత్యగీతాదులతోను పరిపూర్ణమై యుండెను.

క్రమముగా నరేంద్రుఁడు ఔరంగజేబున్న చోటికిఁ జేరెను. అప్పుడు పాదుషా బేగములతో 'పచ్చీసు' ఆడుచుండెను. పచ్చీసు గదులు తెల్లరాతితోఁ గట్టిన యిండ్లు; ఒక్కొక్క బేగము ఒక్కొక్క పావు! పావులు వివిధవర్ణములుగా నుండుట యవసరము. కాబట్టి యా స్త్రీలు వివిధవర్ణముల దుస్తులు ధరించియుండిరి.

అక్కడనుండి నరేంద్రుఁడు జలేఖతో నొక మందిరముఁ బ్రవేశించెను. అరమణీయ గృహమున ముగ్గురు నలుగురు బేగములు సంగీతము పాడుచు వాద్యములు వాయించుచుండిరి. ఆయింటికిఁ గొంచెము దూరమున యమునానది వైపున చలువరాతితోఁ గట్టిన వసారాలో వెన్నెల పడుచుండెను. ఆప్రదేశము శాంతముగను రమణీ

యముగను నుండెను. నీలాంబరమున నొకటిరెండు నక్షత్రములు గానవచ్చుచుండెను. శరత్కాలచంద్రుఁడు సుధావర్షము గురియుచు నభోమండలమునకు సౌందర్యమును, లోకమునకానందమును సమకూర్చుచుండెను. సమీపమున నల్లని యమునానది కలకల నినాదముతోఁ బ్రవహించుచుండెను. చంద్రకిరణోజ్జ్వలమైన యానదీగర్భముపై నొకటి రెండు చిన్న పడవలు దేలియాడుచుండెను. దక్షిణదిశను తాజ్ మహల్ రమణీయముగాఁ గానవచ్చుచుండెను. వసారాలో పరిచారికతప్ప మరెవ్వరును లేరు. ఆమె వీణ వాయించుచు గానముచేసి, అలసటఁ జెంది గోడపై దల వాల్చి, బహుశః సుఖస్వప్నము గాంచుచుండును! యమునావాత మామె కేశరాశితోఁ గ్రీడించుచు, నడుమ నడుమ వీణెను మ్రోగించుచుండెను. యమునాకల్లోలము నాకర్ణించుచు శీతలవాయు సుఖము ననుభవించుచుండ నరేంద్రుని హృదయమున భావోదయ మయ్యెను. ఆనిశీథమున నరేంద్రునకు వంగభూమియందలి హేమలత కానఁబడెను. ఆమెసుందర వదనము సుధాంశుని కన్నను ఎక్కువ సుధామయము. నరేంద్రుని హృదయము ముహూర్తమాత్రము హేమలతా ప్రపూర్ణమయ్యెను. అతఁడాకాశమువంకఁ జూచి నిట్టూర్పు విడిచి, యింకొక వైపునకు నడచెను.

అతఁడు వెళ్ళుచున్న దిక్కున కోలాహలము వినవచ్చెను, అంతఃపురమున కలకలము నాకర్ణించి నరేంద్రుఁ డాశ్చర్యము నొంది, కుతూహలముతో నాదిక్కునకే నడవసాగెను. సమీపించిన కొలఁది నరేంద్రునకు నారీకంఠ వినిర్గతములగు మధురవాక్కులును, హాస్యధ్వనులును వినఁబడఁ జొచ్చెను. మఱింత యాశ్చర్యముతో నతఁ డావైపున కేఁగి జనాకీర్ణస్థానము జేరెను. ఎదుట పెద్దప్రాంగణము, అందు పూలమొక్కలు పూదీగెలు కానఁబడెను. నాలుగువైపుల మేడల చాలునుండి పుష్పమాలికలు వ్రేలాడుచుండెను. వృక్షలతాదులందు ప్రసూనములు వికసించి యుండెను. అక్కడక్కడ కుసుమములు రాశీభూతములై యుండెను. చక్కని కేళాకూళులు కఱిగిన వెండితీగెలను ఆకాశమున కెత్తుకొని పోయి, మరల మౌక్తికరూపమున నల్వంకల వెదజల్లుచున్నట్లుండెను. లతాకుంజములందు, వృక్షాంతరాళములందు, ఎదుట, ప్రక్కన, పైన, క్రిందను నానావర్ణసుగంధ దీపావళి ప్రకాశించుచుండెను. అమరావతి లజ్జనొందు నేఁడీ బేగంమహాలువలె అపూర్వరూపము ధరించినట్లుండెను. ప్రాంగణమున దుకాణముల వీధియున్నది. అందు క్రయవిక్రయములు మిక్కుటముగా జరుగుచుండెను. అక్కడ నందఱును సుందరులే. అమ్మువారు భారతవర్షమునందలి ప్రధాన మహారాజులు, రాజులు, ఉమ్రాహులభార్యలు, కొనువారు పాదుషాబేగములు. అసూర్యంపశ్యలగు యువతులు క్రయవిక్రయములు సలుపుచుండిరి. వారలసౌందర్యమునకు, రసికతకు, వాక్ప్రగల్భతకును నరేంద్రుఁ డాశ్చర్య మొందెను.

ప్రతిసంవత్సరము నౌరోజుదినములలో పాదుషా బేగంమహాలులో నిట్టియంగళ్ళు పెట్టుదురు. భారతవర్షమందలి మహిళామణులు ఈదుకాణములలో వస్తువులను విక్రయింప వచ్చుచుందురు. ఉమ్రాహులు, రాజులును తమ స్త్రీలను బేగములతో పరిచయముకలుగుట కిచ్చటికి వారిని బంపుదురు. పాదుషా యొక్కఁడుతప్ప పురుషులెవ్వరు నిచటికి రారు. పూర్వాచార ప్రకారము ఈ పండుగరోజులలో దుకాణములు పెట్టనిచ్చి ఔరంగ్ జేబు ఇద్దరుబేగములతో నొకదుకాణము నుండి యింకొకదుకాణమునకుఁ దిరుగుచుండెను. భ్రాతృయుద్ధమున ఔరంగజేబుకు సహాయము చేసిన రోషన్ ఆరాకు ఇచ్చట నెంతో గౌరవము, ఎంతో యధికారమును గలవు. దారాపక్షము నవలంబించిన జేహాన్ - ఆరాకు నేఁటియుత్సవమున స్థానములేదు.

విస్మయోత్ఫుల్లలోచనములతో నరేంద్రుఁడీ మహోత్సవము చూడఁ జొచ్చెను. పాదుషా ఒక మొగల్ సుందరిదగ్గఱ కొన్ని యలంకారములను జరీబట్టలను బేరమాడఁజొచ్చెను. బేరమున నొకరి కొకరు తీసిపోవువారుకారు.

“ నీసరుకు మంచిదిగాదు. నీవిక్కడ మోసముచేయవచ్చినావా?” అని ఔరంగజేబుపలికెను.

“ఎటువంటి బేరగాఁడవు నీవు? ఈలాటి సరకులు నీవెన్నడు చూడలేదు. నీకు వీనిసంగతి యెట్లు తెలియును? ఇక్కడకాదు, ఇంకొకచోటికినను నీకుతగిన వస్తువులుదొరకును!” అని ఆచతురురాలు పలికెను.

చాలసేపు బజారుచూచి, నరేంద్రుఁడు ఖణే

ములు నేనీకంకణమును బూనించినాను హృదయమునఁ దాల్చినాను, దీనిని విసర్జింప నాకెంతకష్టముగా నుండునో నీ వెఱుఁగవు. అయినను, దీనినాఁడే దీనిపై నాకధికారము లేదు. నరేంద్రా, నేను విశ్వాసములేని భార్యను కాను'' అని యామె పలికెను.

నరేంద్రుఁ డేమియు మాటలాడక, నిశ్శబ్దముగా హేమలత హస్తమునుండి కంకణమును విప్పెను.

అంతట హేమలత యిట్లనెను: ‹‹ నరేంద్రా, నేను పోవుచున్నాను. నీవు ధర్మపరాయణుఁడవు, చిన్నతనమునుండి నీకు ధర్మమునందాస్థ కలదు, ఆ ధర్మము నెప్పుడు మఱవవద్దు. భగవంతుఁడు నీకు సుఖము నిచ్చును. ఆయన విధించిన ప్రకారము మన ము ప్రవర్తింతము. పుష్పమొకటి రెండు రోజులు పరిమళము వెదఁజల్లి, యెండిపోవును: పక్షి కాంతి చేనుల్లాసము చెంది, గానము సేయును. వాని పని అంతే. నరేంద్రా, నీవు యోధవు; శత్రువులను, జయింపుము, దేశమునకు మేలు చేయుము ఆశ్రయించిన దుర్బలులను కరుణింపుము. భగవంతుఁడు నాకు దేవతుల్యుఁ డగు భర్తను బ్రసాదించెను. పతిసేవయందెన్నఁడు లోపము చేయకుండునట్లును, నిశ్చలభక్తి గలిగి నేను పతివ్రతగా నుండునట్లును దేవుడు నాకు తోడ్పడుఁగాక! అన్నా, నరేంద్రా, చిన్నతనమున నీవు నాకు ధర్మములు బోధించితివి; ఈ పవిత్ర దేవాలయమున తిరుగ ఆ ధర్మము లుపదేశింపుము. అన్నా, ధర్మమార్గము నెన్నఁడు విడువనని నీవు, నిరంతరము పతివ్రతనై యుందునని నేను వాగ్దానము చేయుదము రమ్ము!'' ఈ వాక్యములు ముగించి హేమలత విగ్రహము నెదుట ప్రణామము చేసెను; నరేంద్రుఁడు నిశ్శబ్దముగా ప్రణమిల్లెను.

లేచి, హేమలత నరేంద్రుని చేయి సయత్నముగాఁ బట్టుకొని, ‹‹అన్నా, రాత్రి చాల దాటినది; సెలవిమ్ము! నిరంతరము నిన్ను నే నన్నువలె ప్రేమింతును; నీవు నన్ను చెల్లెలివలె భావింపుము'' అని చెప్పి బాష్పకణము తుడిచికొని, మెల మెల్లన దేవాలయమునుండి బయలు వెడలెను.

కంటికిఁ గానఁబడుచున్నంత వఱకు నరేంద్రుఁడా మెవంకఁ జూచుచుండెను. తరువాతనో?— తరువాత, నరేంద్రుని యారాత్రి శోకవిషాదముల నాలోకించుచో లోకములో పరమనిర్భాగ్యుఁడు నైతము విమఖుఁ డగును. ఆదీనుని హృదయము శూన్యమయ్యెను; ప్రణయవృత్తాంతము నాటితో సమాప్తి నొందెను.

మాధవీకంకణము నక్కునఁ జేర్చి నరేంద్రుఁడు యమునాతీరమునఁ గూరుచుండెను. దీనిని విప్పుము దీనిపై నాకధికారము లేదు, నరేంద్రా, నేను విశ్వాసములేని భార్యను కాను అనెడి యామెపలుకులు మాటిమాటికి జ్ఞప్తికి వచ్చుచుండెను. ఆ ప్రేమచిహ్నము నుంచికొనుటకు నరేంద్రుని కధికారము గలదా! రేయియంతయు దాని నాతఁడు హృదయముపై నుంచికొని ప్రాతఃకాలమున శూన్యహృదయముతో దానిని వదలివై చెను. యమునానదీజలమునఁ దేలియాడుచు కుంకణ మదృశ్యమైపోయెను.

## ౩౮

వంగదేశమునుండి షాహసుజా యుద్ధార్థము రెండవ పర్యాయము వచ్చుచుండెనని వెనుక జెప్పబడినది. శీతకాలమున ప్రయాగదగ్గఱ సుజాకు ఔరంగజేబుకు గొప్పయుద్ధము జరిగెను. రెండు రోజులు పోరాడి పరాజితుఁడై సుజా పాఱిపోయెను. ఈ యుద్ధమున జస్వంతసింగు ఔరంగజేబుకు విరుద్ధముగా నుండ యత్నించెను; కాని తీక్ష్ణబుద్ధి యగు నా మహాయోధుకు నష్టము కల్గింపలేక రాజస్థానమునకు మరలిపోయెను.

సుజా ప్రయాగనుండి పాట్నాకు, పాట్నానుండి ముంగేరుకు, ముంగేరునుండి రాజమహాలుకు, అచ్చటనుండి గంగానదిదాటి తండాకు పలాయనము చేసెను. ఔరంగజేబు కుమారుఁడు మొహమ్మదు, సేనాపతి అమీర్ జుమ్లాయును సుజాను వెంబడి చిరి. తండాలో మొహమ్మదు సుజాపుత్రికను పెండ్లియాడి, యాతనిపక్షమున జేరెను. అట్లయినను, అమీర్ జుమ్లా ఇరువుర నోడించెను పిమ్మట మొహమ్మదు తనతండ్రియొక్క ధూర్తపత్రికను నమ్మి భార్యను సుజాను త్యజించి వెడలిపోయెను. పాపము! సుజా ఆరాకాన్ దేశమునకు పాఱిపోయెను. అక్కడి రాజుతో విరోధము సంభవించుటచే సుజా ససైన్యముగా నిహతుఁడయ్యెను. ఆయనదుహితను రాజు వివాహము చేసికొనెను. రూపవతియగు ప్యారీబానూ విచారముచే, నాత్మహత్య చేసికొనెనని జనశ్రుతి కలదు. ఎవఁడు వంగదేశమును ఇరువదిసంవత్సరత

ములు పాలించి, పాలనమున కరుణను యుద్ధమున సాహసమును హిందువులయెడ నౌదార్యమును జూపి ఖ్యాతిగాంచెనో; ఎవ్వని రాజమహలు నగరమండలి ప్రాసాదము మర్త్యలోకమున అమరావతి వలెనుండి, దివారాత్రము లానందలహరీనిమగ్నమై యుండెడిదో, అట్టి సుజా మరణకాలమున తలదాచుకొనుటకు చోటులేక, విదేశమున శత్రువుచేత సకుటుంబముగా వినష్టుడయ్యెను !

దారా శ్యామనగరము, లేక ఫతే అబాద్ యుద్ధమున పరాజయమునొందిన పిమ్మట సింధుదేశమునకు పలాయనముచేసెను. ఔరంగ్ జేబ్ సైన్యము దారా నక్కడనుండి ఢిల్లీనగరమునకుం గొనిపోయెను. నృశంసుడు ఔరంగ్ జేబు తనయన్నగారినిచ్ఛవచ్చిన ట్లవమానించి, వధించెను. చెఱసాలయందున్న మురాద్ కూడ త్వరలో ప్రభువునాతిచే నిహతుడయ్యెను. భ్రాతృరక్తస్నాతుడై ఔరంగ్ జేబు భారతవర్ష సింహాసనము నధిరోహించెను.

మథురలో హేమలతను జూచిననాటినుండి నరేంద్రునకు మతిపోయినట్లయ్యెను. వంగదేశమునకుం బోయినపిమ్మట హేమలత నరేంద్రుని గూర్చిన వార్తలరయుచుండెను; ఉదారహృదయుండగు శ్రీశచంద్రుడు దేశదేశములయందు నరేంద్రుని వెదకించుచు, అతడు మరలివచ్చినచో జమీలో సగముపాలు ఇత్తునని చాటించెను. కాని, నరేంద్రుడానాటినుండి యెవ్వరికిని గనబడలేదు.

హేమలత వీరనగరమున తనభర్తతో నివసించుచుండెను; మథురానగర దేవాలయమున తానుచేసిన ప్రతిజ్ఞ నామె విస్మరింపలేదు. ధర్మపరాయణ యగు హేమలతకు పతిసేవయందే కాలముగడుచుచు, వేఱుతలంపులు కలుగుట మానెను. పతిభక్తి తప్ప ఆమెకు వేఱొక ధర్మము తెలియకుండెను. క్రమముగా నామెకు హేమంత కుమారి సరయూబాలయను పుత్రికలిరువురను, ప్రతాపుడను కుమారుడును జన్మించిరి. ఇరువదియేండ్ల క్రిందట శ్రీశుడు, నరేంద్రుడు, హేమలతయు సాయంకాలమునం దాటలాడుచున్నట్లే తన కుమారుడు కుమారితలు గంగయొడ్డున నాడుచుండ హేమలత బాష్పవికసిత నేత్రములతో విలోకించును. పిల్లలు గంతులు వేయుచు, పరుగు లిడుచు, ఆనందధ్వనితో కం జవనము ప్రతిధ్వను లీనునట్లు ఆడుచుందురు. సంసారమున ఒకతరముదాటి రెండవతరమువచ్చినది శిశువుల ముఖములు చింతాశూన్యములై, నేత్రములు తేజోవంతములై యున్నవి; ఇంకను జీవనపు విచారము లా దివ్యావయవములపై నంకితము కాలేదు.

వివాహమయిన తరువాత రమారమి పదిసంవత్సరములకు హేమలత తన సంతానమును వెంటబెట్టుకొని, యొక సన్యాసిని, సందర్శింపవలెనని యాశ్రమమునకుం జనెను. వీరనగరమునకు కొన్ని కోసుల దూరమున ప్రసిద్ధమైన శాల్మలీవృక్షము గలదు. వృక్షస్కంధమున కించుమించుగా మూడువైపుల నూడలు గోడలవలెం బెరిగినవి. చూచువారి కవియన్నియు పెద్దగృహమువలెం గానంబడును. ఆవింతయింటిలో నొక సన్యాసి కొన్ని సంవత్సరములనుండి నివసించుచుండెను. పల్లెలలోని యిల్లాండ్రును బాలికలును సానురాగముగా నాజడదారికి ప్రత్యహముపాలు పండ్లు, దుంపలు సమర్పించుచుందురు; వానితో ఆయన జీవించుచుండెను. ఇంచుమించుగా పగలంతయు నతడు ధ్యానమునం దుండును; సాయంకాలమున గ్రామములో నింటింటికిం బోయి, శోకవిహ్వలుల నూఱడించుచు, రోగులకు శుశ్రూష చేయుచు, దీనులకు తోడ్పడుచు, మానవుల కష్టములను దొలగించుట తనకు నియమముగా బెట్టుకొనెను. అర్ధరాత్రము వఱకు నీపనులు చేయుచు, పిమ్మట తన తరుగృహమున కరిగి, అన్నిఋతువులలోను ఒకేవిధముగా నతడు గడ్డిపై నిద్రించును. ఆకోటరమున నున్న జడదారిని దర్శించుటకు వివిధగ్రామములనుండి యనేకులు వచ్చుచుందురు.

హేమలత వృక్షమునకు కొద్దిదూరమున పడవదిగి, కాలినడకను మెల్లమెల్లగా వృక్షమునకుం జని, మునికి నమస్కరించెను; పిమ్మట తనపిల్లల నెత్తుకొని నిలిచియుండి తాపసుని వంకం జూడసాగెను. అటనుండి యింకతనదృష్టి మరల్పలేక యామె నిష్పందముగా విలోకించుచుండెను.

తపసియు హేమలతను నిశ్చలదృష్టితో వీక్షించెను; అనురాగ పూరిత నేత్రములతో హేమలత నమస్కరించుట చూచెను; సతృష్ణముగా నామె సంతానమును విలోకించెను. చూడం జూడ, ఆయన హృదయము గ్రక్కదలి నట్లు కంట నొకబా

వృత్తాంతము గ్రహించినట్టున్నది. తుదకు సన్యాసి ధీరముగా హేమలత దగ్గఱకు వచ్చి, శిశువుల మస్తకములపై హస్తముంచి యాశీర్వదించెను. అంత నతఁడు నిశ్చలదృష్టితో నామెనవలోకించు చునిట్లనెను: "దైవ సమునైన భర్తయెడ నీకు నిశ్చలభక్తి యుండునుగాక! పరమ పతివ్రతవై వెలయుదువుగాక!"

సన్యాసి నెమ్మదిగా వెడలి పోయెను. ఆటు తరువాత నాతరు తరుమున నాతఁడెవ్వరికిని గాన బడలేదు. ఆగ్రామమునుండి యాతఁడెచ్చటికిఁ బోయెనో యెవ్వరును గ్రహింపలేక పోయిరి.

సమాప్తము

# నీరో పాట

నోరి నరసింహం

మండు భగభగ రోము పురమా
మండు భగ్గున రాజధానీ
మంట చూచిన నాదు తను పు
ప్పొంగిపోయెడిని!

చిటచిటా దూలాలు చీలిచి
సురసురా యని చూరు లంటి
పటపటా పగిలించి గోడలు
భగ్గు మనిపించు!

మేడ వెంటనె మేడ నంటుము
వీధి వెంబడి వీధి రగులుము
ఊరు నంతా భగ్గుమని ని
ర్మూల మొనరించు!

ఒక్క పురుగును మిగల నీయక
మెక్కుమీ నీకడుపునిండా
లెక్క లేనేలేదు 'సీజరు'
యొక్క దాన మను!

మ్రింగుమీ ఆ ధనికు హర్మ్యము
మ్రింగుమీ ఆ నాట్య భవనము
మ్రింగుమీ ఆ కావ్యశాలను
మ్రింగు సర్వమ్మున్ !

అల్లదే నిగ్గనక బళ్ళో
పిల్ల లెందరొ కలరు వారల
బుల్లి మేనులు ప్రీతి సురసుర
బూది యొనరింపు !

ఆ సభాస్థలి సభకు కూడిన
దేశ దేశాగత జనమ్ములు
చూసిరిగా బర్విడక మునుపే
రాసిగా చేయు !

ఆజ్ఞకై తమ జీవముల నా
కమ్మివేసిన వీరకోటుల
గుడిసె లవియే దాన మిచ్చితి
కూల్చు మవి యన్ని !

ఆరిపోవకు మారిపోవకు
మూరు నన్ను నొద్దదీపము
ఊరు నీపెను నోట పడువర
కారి పోవకుమీ !

మండు భగభగ రోము పురమా
మండు భగ్గున రాజధానీ
మంట చూచిన నాదు తను పు
ప్పొంగి పోయెడిని !

# చిత్రకారుఁడు

(అజయకుమారసేను వంగమాతృక ననుసరించి)

శ్రీ. వీరరాఘవ స్వామి

౧

ఆకాలపు చిత్రకారులలో విమలుని యందు జనులకు భక్తిశ్రద్ధలు మెండు. నిజముగ విమలుఁడు వ్రాసినదెల్ల అతి సుందరముగను ఆనందదాయకముగను నుండేది. కాని సామాన్యజనులు అతని చిత్రపటముల నంతగా మెచ్చుకొనే వారు కారు. ఏరూపభావములతో లోకులు తనను చిత్తరువులు వ్రాయ నియోగింతురో ఆప్రకార మతఁడు చేయక తన బుద్ధి ననుసరించి చిత్రించే వాఁడు. అందుచేత అతని నెవ్వరును పెద్దపెద్ద చిత్తరువులు వ్రాయుమని నియోగించేవారు కారు— శ్యామలుని నియోగించేవారు.

శ్యామలుఁడు గొప్పయింట బుట్టిన వాఁడు, చిత్రకళయందు నవీనమతావలంబుఁడు. కాని అంతనైపుణ్యము కల వాఁడు కాఁడు. ఎక్కడ ఎక్కువ రంగు పూసిన చిత్రసౌందర్య మతిశయించు నని తోచునో అక్కడే మరింత రంగు బూసి దానిని ఎక్కువ డాబుగా నుండేటట్లు చేసేవాఁడు. లోకులును అట్టి చిత్తరువులనే మెచ్చేవారు. అనేకు లతనినే చిత్తరువులు వ్రాయ నియోగించేవారు. అందుచేత దేశములో నతని పేరు త్వరగా ప్రసిద్ధిలోకి వచ్చినది. అందువల్ల నతఁడు విశేషధనముగూడా ఆర్జించెను. కాని ప్రతిభాసంపన్నుఁడైన విమలుఁడు దారిద్ర్యమందే యుండెను. అతనికి కుటీరావాసము తప్పలేదు.

విమలునకు గురువులు లేరు. చిత్రలేఖన మతఁడు తనంతనే నేర్చుకొనెను. శ్యామలుఁడు గురువుదగ్గర శిక్షపొందిన వాఁడు. అందుచేత వారికి మతభేదాలుండేవి. అయినను వారిద్దరికీ అన్యోన్యస్నేహము. విమలుఁడు ధ్యాని, మధురభాషి. అయితే అన్యులతో చనువుగా మాట్లాడఁడు. నిర్జనస్థలమున గూర్చుండి ఏకాగ్రచిత్తముతో నతఁడు చిత్రములు చిత్రించును. కాని ఆచిత్తరువుల నెవ్వరూ కొనేవారు కారు.

౨

"తనకు గావలసిన చిత్తరువును వ్రాసి యిచ్చినవారికి కోరి నంత బహుమాన మిత్తునని ధనికుఁడొకఁడు ప్రచురించెను."

విమలుఁ డెల్లపుడును దన కుటీరముననే యుండేవాఁడు, ఎక్కడకును పోవు

వాఁడు కాఁడు. అందుచే బయటివార్తలతనికి దెలియవు. ఏదైనా ఒక చిత్తరువు వ్రాయ సంకల్పించుకొని నిరంతర మతఁడు ధ్యానమగ్నుఁడై యుండేవాఁడు. చిత్తరువే అతని సర్వస్వము.

ఒకనాఁడు విమలుఁడు చిత్రశాలలోనుండఁగా అతని భార్య ఉత్సాహముతో నేదో అతనికి జెప్పఁబోయెను. విమలుఁడు తదేకదీక్షతో నేదో చిత్రించుచుండుటచేత ఆమెను చూడలేదు. భర్త ఎప్పుడు తనవంక చూచునోయని ఆమె ద్వారముదగ్గర నిరీక్షించుచుండెను. ఎంతసేపటికిని విమలుఁడు తలయెత్తలేదు. ఆమెయునట్లే చిత్తరువువంకను విమలుని వంకను చూచుచు నిలుచుండెను. కొంతసేపటికామె చిత్త మాచిత్తరువున లీనమయ్యెను.

కమల విదుషి. ఆమెకు చిత్రకళయందభిరుచి మెండు. భర్త వ్రాసిన చిత్తరువు చూచి యామె యానందించుచుండును.

కమల పతిభక్తిపరాయణ. ఆమెకు భర్తకంటె ప్రేమాస్పదమగు వస్తువు వేరేదియును లేదు, వేరుదైవమును లేదు వారిరువురి స్వభావములుకూడా ఒక్కటే. అయితే దారిద్ర్యచింత మాత్రమెప్పుడైనా ఆమెను బాధించుచుండును. నేడామెకీ ప్రచురణవార్త దెలియుటచే నుత్సాహము కలిగెను.

విమలుఁడు చిత్రలేఖన మాపి ఏదో కొంచెము కొరత యున్నట్లు తోచఁగా దానిని పరిశీలింప నాలుగడుగులు వెనుకకు వేయఁబోయెను. అప్పుడతనికి ద్వారమున నిలిచియున్న కమల కనబడెను. అంతనాశ్చర్యముతో నతఁడు, 'నీవువచ్చి ఎంత సేపైనది?' అని యామెను ప్రశ్నించెను.

కమల చిరునవ్వుతో, 'ఒక గడియ సేపైనది.' అనెను.

"నీముఖము చూస్తే నీవేదో ఉత్సాహముతో చెప్పదలచివచ్చినట్టు కనబడుతుంది. నిజమేనా!"

'అవును'

'ఏమిటది?'

'ఒక ధనికుఁడు తాను కోరినట్లు చిత్తరువు వ్రాసి యిచ్చేవారికి కోరినంత బహుమాన మిస్తానని ప్రచురించినాఁడట ఆచిత్తరువును మీరు వ్రాస్తారేమో అని చెప్పవచ్చాను. అలాచేస్తే మీకు పేరుప్రతిష్ఠలు వస్తవి. మన దారిద్ర్యము కూడా వదిలిపోతుంది.

'ఏమిటది! ఆయన కోరినట్టు చిత్తరువు వ్రాయడమా! అందుకు శ్యామలుఁడే సమర్థుఁడు.

ఇట్లనుచు విమలుఁడు చిత్తరువు కడకుబోయెను. భార్యచెప్పిన మాటలతనికంతగా మనసుకు పట్టినట్టులేదు. అతఁడంతట కుంచెతో రంగుదీసి పటముపై నేదో చిత్రించెను. చిత్రము తాననుకొనినట్లు వచ్చుటచేత కాబోలు అతని ముఖము ప్రఫుల్లమయ్యెను.

కమల ఇదివరకెన్నఁడు భర్త కెదురాడి యెరుగదు. భర్త తనమాటలను వినీవినట్లుండుటచేత ఆమె నిరుత్సాహయయ్యెను. కాని ధనేచ్ఛమాత్రము తగ్గలేదు. ఆమె భర్తను సమీపించి, "మీ

మనస్సుకు కష్టము కలిగించడము నా ఉద్దేశ్యముకాదు. ఆచిత్తరువు మీరు వ్రాస్తే మీకు ప్రతిష్ఠ రావడమేకాక మన కష్టాలు కూడా కడతేరుతవి. అదే నాకోరిక. మీరు కోపపడక నామనవి చిత్తగించవలె," అని దీనముగా ప్రార్థించెను.

ఆమె ప్రార్థన మంతగా అతని చెవి దూరినట్లు లేదు. అతడా చిత్రపటమును జూచుచు ఆనందించుచుండెను. కమల భర్త హస్తములను పట్టుకొని గద్గద కంఠముతో, ఈసారిమీరు నాప్రార్థన వినకతప్పదు. మీరు బయటికి పోరుకాబట్టి బయటి సంగతులు మీకు దెలియవు. శ్యామలబాబు ధనము సంపాదించి ఎంత సుఖంగా ఉన్నాడో మీరెరుగరు. అతనిని ఎందరు ఆహ్వానిస్తారో, ఎంతగా రవిస్తారో చూడండి. మనము మొదటి నుండీ దరిద్రులుగానే ఉన్నాము ఇప్పుడూ దరిద్రులమే. కనుక ఈఒక్కసారి మీరు నామనవి వినవలె" అని దీనముగా వేడెను.

ఆమె దీనాలాపముల కతని మనస్సు కరిగి, సరే చూతాములే, అన్నాడు.

3

ఒకనాడు విమలుని కుటీరము దగ్గర శ్యామలుడు ఇంకకొందరు చిత్రకారులూ సమావేశమైరి.

విమలుడు తన కుటీరములోనే యుండెను. బయటనున్న జనసమూహమును జూచి కమల చిత్రశాలకు వెళ్ళి విమలునితో,' మన వాకిలిముందర ఎంతమంది ఉన్నారో చూడండి' అన్నది.

విమలుడు, 'ఎవరువారు? ఎందుకు వచ్చారు? వారికేమికావలె?' అని ఆమెను ప్రశ్నించెను.

'నాకు మాత్ర మేమి తెలుస్తుంది? బయటకువెళ్ళి చూడండి. వారేదోచిత్తరువుసంగతి మాట్లాడు తున్నట్లు తోస్తుంది'.

'ఏమిచిత్తరువు? ఎవరిచిత్తరువు?'

'బయిటికి వెళ్లివారితో మాట్లాడండి అన్నిసంగతులూ తెలుస్తవి.'

విమలుడు బయటికి వచ్చెను. శ్యామలు డతని సమీపించి కౌగిలించుకొని, 'అన్నా, మీకేమైనా చిత్తరువు సంగతి తెలిసిందా?' అనెను. మరొకడు, 'ఆచిత్తరువు వ్రాయడానికి విమలుడే సమర్థుడు. ఇంకొకరి చేత కాదు.' అనెను. విమలుడు, 'తమ్ముడా, చిత్తరువేమిటి? నాకేమి తెలియదే!, అనెను. శ్యామలుడు "ధనికుడొకడు చిత్రపట మొకటి కావలెనని ప్రచురించినాడు. తానుకోరినరీతిగా వ్రాసి యిచ్చినవారికి గొప్పబహుమాన మిచ్చునట చిత్రము మృతభర్తచెంత భార్యకూర్చున్నట్లు ఉండవలెనట, అని చెప్పెను.

మృతభర్తచెంతభార్య కూర్చున్నట్లు అనుమాటలు వినగానే అతని శరీరమంతయు నొక్కసారిగ ఝల్లుమనెను, ముఖము వెలవెల బారెను, చిత్తవికారము జనించెను, మృత్యుదేవత భీకరాకృతితో తన నాక్రమించు చున్నట్లే తలచెను. విమలుని ముఖభంగి పరిశీలించి శ్యామ

లుడు! నీవంత • భయపడతావెందుకు? నీసామర్థ్యము నీవెఱుగవు, నాకు తెలుసును. నీవే దానిని చిత్రింపగలవు. నీవింక అభ్యంతరము చెప్పవద్దు! అనెను.

ఆమాటలు విమలుని చెవి దూరినట్లు తోచదు. విమలుని మౌనమును జూచి అందరూ నిశ్శబ్దముగా నుండిరి. కొంతసేపటికి విమలుడు, 'అది నాచేత కాదు. దానిని చిత్రింపనీవే సమర్థుడవు, నీవే ప్రయత్నించుము', అనెను.

శ్యామలుడును తదితరులును విమలుని చేతులుపట్టుకొని, అన్నా, నీవే సమర్థుడవు, నీకంటె దానిని చిత్రించే వారు ఎవ్వరూ లేరు. మాప్రార్థనవిని నీవీపనిపూనుకోవలెను, అభ్యంతరము చెప్పవద్దు, అనిఏకగ్రీవముగా బతిమాలిరి.

విమలు డేమీ మాట్లాడక తనకుటీరములోకి బోయెను.

౪

విమలుడు నేటికైదారుదినముల నుండి చిత్రశాలనదలి బయటికి వచ్చుటలేదు. అతడొక చిత్తరువును గైకొని తదేక దీక్షతో చిత్రించుచుండెను. పగలు లేదు, రాత్రిలేదు, నిద్రలేదు, ఆహారములేదు! నిరంతర మూతని మనస్సు చిత్రపటమున లీనమైయుండెను.

భార్య పిలిచినను అతడు పలుకుటలేదు. చిత్తైకాగ్రతతో అతడు పటముపై నేదో చిత్రించుచునేయుండెను. ఆచిత్రించినది తాననుకొనినట్లుండకపోవగా పటము నావలవైచి ఒకచోటకూర్చుండి తీవ్రముగాధ్యానించును. ధ్యానముతో కొన్ని దినములుగడచెను. చిత్తరువు కొంచెమైనా తాననుకొన్నట్టురాలేదు. ఎన్నిసారులో చిత్రించెను, ఎన్నిసారులో ధ్యానించెను. కాని చిత్తరువాతడనుకొన్నట్టు రాలేదు. చివరకతనికేజ్వవచ్చెను.

భర్త యవస్థనుచూచి కమల పలువిధముల దీనముగావిలపించెను. ఆవిలాపము లాతనికి వినబడలేదు. ఒకప్పుడర్ధాన్నము భుజించుటచేతను ఒకప్పుడు నిరాహారుడుగా నుండుటచేతను అతని శరీరము చిక్కిపోయెను. శక్తియు క్షీణించిపోయెను. చివరకు కుంచెను పట్టుకొనుటకుకూడ శక్తిలేకపోయెను.

అంధకారబంధురమగు నొకనాటి రాత్రి విమలుడు తన భార్యను పిలిచి "నన్నొకసారి బయటికి తీసికొని పోతావా? లేవలేకున్నాను," అనెను.

భర్త యవస్థను చూచినప్పుడెల్ల ఆమెకు మహాభయము కలుగుచుండెను. చెప్పరాని ఆవేదన ఆమె హృదయమును కలచివైచుచుండెను. ఆమెకు అన్నము రుచించుటలేదు, కంటికినిదుర వచ్చుటలేదు.

విమలుడు భార్యను పట్టుకొని బయటికి వచ్చి "ఏమిటిది, నాకేమీ కనబడడంలేదే. నాకళ్ళేమైనవి. కొంచెమంతే కొంచెమైనా కనబడడం లేదే. అంతా గాఢాంధకారముగా ఉన్నదే!" అనెను.

నిజముగా బయట చిమ్మచీకటి క్రమ్మియుండెను. ఆకాశము కాలమేఘా

చ్ఛాదితమై యుండెను, శ్రవణభేదకముగా మేఘములు గర్జించుచుండెను. విద్యుల్లతలు నేత్రములకు మిరుమిట్లు గొల్పుచుండెను. ఆకు అల్లాడుటలేదు. కాల మాసన్నమైనట్లుండెను.

విమలునకు నిజముగా దృష్టి తప్పిపోయినది.

కమల, "ఇంట్లోకి పోదాము రండి తుపానుకూడా వచ్చేటట్టుంది. ఇకనైనా నిద్రపోదురుగాని రండి" అని బ్రతిమాలెను.

మద్యపాన మత్తునివలె తూలుచున్న విమలు నెట్లో భార్య లోనికి తీసికొని పోయెను. తన శక్తియంతయు నశించుచున్నట్లు అతనికి దోచెను. చైతన్య మంతర్ధాన మగుచున్నట్లుండెను. కొంతసేపటి కతడు భార్యను పిలిచి, "నన్నొకసారి చిత్రశాలలోకి తీసికొని పోతానా— ఒక్కసారి!" అన్నాడు. అందు కతని భార్య, "మీరెక్కడకీ పోవద్దు మిమ్ము చూస్తే నాకు భయము వేస్తున్నది. ఇకనైనా నిద్రపొండి. ఇకనైనా శాంతి విశ్రాంతి తీసుకోండి," అని బ్రతిమాలుకొనెను. విమలుడు రుద్ధకంఠస్వరముతో, "కాదు కాదు, ఒక్కసారి తీసుకుపో— ఒక్కసారే," అనెను.

విమలుడెంతో కష్టముమీద చిత్తరువు ఎదుట కూర్చుండి తడబడు మాటలతో "ఓహో! మళ్ళీ కళ్ళు కొంచెము కనబడుతున్న వే. అయితే చాలాసేపు చూడలేను. దృష్టి తప్పిపోతున్నది, సత్తువకూడా పోతున్నది. చివరసారి ఆఖరుంచె నొకమాటు నా చేతికిస్తావా, తుదిసవరణ చేస్తాను.,, అనెను.

అత డంతటకుంచె పట్టుకొని తుదిసవరణచేసి "చాలు" అనుచు క్రిందబడెను.

ప్రక్కనున్న కమల ఇంతంతనరాని తొట్రుపాటుతో కేకవేసి అతని పట్టుకొనబోయెను కాని ఆమెప్రయత్నము నిష్ఫలమయ్యెను. ఆమెచేతు లామెకు స్వాధీనము కాలేదు. నోటమాటరాలేదు. ఆమెచైతన్య మకస్మాత్తుగా నెగిరిపోయెను. ఆమె భర్తపాదసమీపమున కూలబడెను.

మరునాడు సూర్యోదయము కాకమునుపే ఆధరకుడను శ్యాములుడును తదితర చిత్రకారులును విమలుని కుటీరమునకు వచ్చిరి. శ్యాములుడు ద్వారము కడకుపోయి, విమలా అని పిలిచెను. ప్రత్యుత్తరము రాకుండుటచేత నతడు కుటీరము లోనికిబోయి చిత్రపటమూలమున పడియున్న విమలుని శరీరమును, తత్ప్రాంతమున శిలావిగ్రహము వలెనున్న అతని భార్యను చూచెను. ఇరువురును మరణించి యుండిరి.

శ్యాములుడు బైటికివచ్చి గద్గదకంఠముతో "విమలుడు చిత్తరువు పూర్తిచేసినాడు. కాని అతడు మాత్రము లేడు!" అనెను. పిదప మాటలాడలేకపోయెను.

అదివిని అందరు నైకకంఠ్యముగా, 'ఏమిటి? విమలుడేమైనాడు?" అని శ్యాములు నడిగిరి. శ్యాములుడు పిల్లవానివలె నేడ్చుచు మరల లోనికి బోయెను.

అందరును లోపలకుబోయి జరిగినది

ంచి నిస్తబ్ధులైరి. చిత్తరువు నందెట్లు చిత్రితమైనదో అట్లే శరీరములు త్యజించిన కమలా విమలలు కనబడుచుండిరి. విమలుడు దేనిని పటమున జిత్రించెనో దానినే తన జీవితకాలములో దృశ్యముగా చేసినాడు. చిత్తరువులో కూడా కమలా విమలుల రూపాలేయున్నవి ఎదుట హృదయ భేదకముగా శారీరశరీరములు కనబడుచున్నవి. ఏమాత్రము భేదము లేదు. ఒకటే దృశ్యము!

అశ్రుపూర్ణ నయనములతో భేదములేని ఆచిత్రముల రెంటిని జూచుచు అందరు నిలుచుండిరి. చిత్రకారుడు చిత్తరువు నందును జీవితకాలమందును ఒకే దృశ్యమును చిత్రించినాడు!

# కవిదారిద్ర్యము

విద్వాన్, శతావధాని, కోపల్లె శివకామేశ్వర రావు

నీయనురక్తి కోడలు వనేజము లుండెడి కోట్లు చూపి, యా
త్మీయత మోదకేళికల నాడుట యోపి నిసర్గవృత్తి; న
న్యాయము కాదె కోడలిక నాజవగాలిపముం దలంచు; ట
మ్మా యని పిల్చు పుత్రు భవదాదిగ పాత్రుని జేయఁ జెల్లదే?

రామ, మనోనివాసిని, పురాభవ పుణ్యఫలంబు కల్మి నం
బ్రేమమునం దనంతన వరించి, గ్రహించి, పరిష్వజించె; న
మ్మా మనవంశ మాయువతి మాన్యచరిత్రను వాసికెక్క, నీ
ధామము లోకమోహన నిధానముగా నొనరించె నుత్తలన్.

చెల్లియుఁ జెల్లకున్న నను సిగ్గున మోమొకయింత యోరగా
మెల్లని తేనెపల్కుల నిమీలన విభ్రమ యుక్తిఁ గన్నుల
ల్లల్లనఁ ద్రిప్పు ముగ్ధ, జవరాలిని గాయ్యునఁ దేల్చుచుంట యో
తల్లి, దొసంగుగాఁ గనెదె త్వత్పదయుగ్మము నాశ్రయింపగన్?

నాసహచారిణీ విలసనంబులు, నాయమృతైక మూర్తి మా
న్యాసరసార్ద్రగీతికలు విందొనరింప సమస్తలోకముం
బాసి, రసోర్మిమై మఱచి, భావము పొంగగ నాలపించు న
న్నో సరసీజవాసిని, సుతోచితవృత్తిని జూడ వేమొకో?

బాల్యమునాఁటియట్లు నను భావనసేయఁడు, భార్య కేమో
లౌల్య మనోనుకూల సుఖలాలసుఁ డయ్యె నటంచుఁ బితృ దౌ
ర్బల్యము చూచి, కోపపడ భావ్యమె నాపయిఁ దల్లి? మాతృ వా
త్సల్యము చూపగాఁ దగు, యథావిధిగా నినుఁ బూజచేసెదన్!

నీదు స్నుషాసుతుల్ ప్రణయ నిర్ఝరిణీ ప్రవిగాహితాత్ములై
మోదము నింగి ముట్ట, మనముల్ నశియింపఁగఁ దానెబ్రహ్మమౌ
నాద మఖండపూర్ణమువినంబడ, నా శ్రుతిఁగల్పిపాడును
న్మాదులు నైనమమ్ముఁ గరుణం గనవేడ్క జనింపదో కదే!

# గాలి పాటు

చింతా దీక్షితులు, బి. ఏ., ఎల్. టి.

నేను బీదకుటుంబంలో పుట్టి పెరిగిన వాడ్నైనప్పటికీ ఉన్నతవిద్యలు పొందని వాడ నైనప్పటికీ, ఒక్కమాటు హఠాత్తుగా లక్షాధికారినికావడమునకు కారణమేమో ఒకరిద్దరికితప్ప మరెవరికీ తెలియదు. అంతేకాకుండా నేనువకుటుంబములో నైతే దూషించేవాడనో ఆకుటుంబములోపుట్టిన కన్యకను వివాహము చేసుకొని సుఖంగా కాపురంచేస్తూవుండడంకూడా ప్రజలకు వింతగానేవుంది. కాని దాని కారణంకూడా యెవరికీతెలియదు. దీనికంతకూ పెద్దగాథవున్నది. చెప్తావినండి.

వేసవికాలం ఒకనాటి మధ్యాహ్నం పూసుపోక మాముత్తాతగారి వ్రాత ప్రతులుంచిన తాటాకుపెట్టె ముందర వేసుకొని కాలక్షేపం చెయ్యతలుచుకున్నాను. మాముత్తాతగారిపేరు లోకంలో మోగి పోయింది. వ్యాకరణంలో అంతవారు లేరని యిక వుండరనీ నేటికి కూడా చెప్పుకోవడంకద్దు. వారుపండ్రెండవయేట చదువుకునే వూహతో కాశీలేచిపోయినారట. అక్కడపదిహేను సంవత్సరముల పాటు విద్య సాంతముగా గ్రహించి యింటికితిరిగి వచ్చినారట. ఇప్పటికికూడా మా ముసలమ్మ చెప్తూవుంటుంది. వచ్చేటప్పుడు రెండుగుర్రాలమీద శాలువలూ, పట్టుబట్టలూ ధనమూతీసుకొని వచ్చినారట. ఇప్పుడెందుకు ఆగొడవంతా చెప్పడం. ఆరోజులువెళ్లేయి. ఆరోజుల్లో మాకుటుంబం చాలా ఉచ్చగా వుండేదిట. అన్నట్టుఅసలు సంగతిచెప్పడం మరచిపోయేను. రాయడం ఎప్పుడూ అలవాటులేకముందుసంగతి వెనకా వెనక సంగతి ముందూ చెప్తుతూంటాను, కొంచెం క్షమించండి!

ఇప్పుడున్నట్టు మా ముత్తాత గారి

రోజుల్లో ఈతిబాధలులేకుండా వుండేవా యని అనుకుంటున్నారేమో: అలా అనుకోవడం చాలా పొరపాటు. అవి దండులుగావు, అవి పిండారీలుకావు, అవి గత్తరలుకావుట: మా నుసలమ్మ చెప్తూవుంటుంది!

కాశీనుంచి వచ్చేటప్పుడు మా ముత్తాతగారు ఎంతో డబ్బుకూడా తెచ్చారట. ఎంతడబ్బు తెచ్చేరు, ఏరూపంగా తెచ్చేరు అనే సంగతులు ఎవరికీ తెలియవు. ఈధనమంతా ఆయన భోషాణంలో పెట్టి ఆభోషాణం మీదనే పండుకునే వాడట. ఇంకా ఆభోషణం మాయింట్లోవుంది ఎవరికేనా చూడాలని వుంటేను.

ఇలావుండగా ఒకనాడు వూళ్ళో పుకారుపుట్టింది రాఘవరాజు గత్తరవస్తోందని. రాఘవరాజు అనే ఒకక్షత్రియుడు కొంత దండును సమకూర్చి గ్రామాలలోకి రావడం ప్రతిగృహస్థు దగ్గరకూ వెళ్ళి అడిగి ధనము పుచ్చుకోవడమూ, ఇవ్వకపోతే ఇళ్ళుతగలబెట్టి గ్రామాలు దోచుకుపోవడం చేసేవాడట. ఇదే రాఘవరాజు గత్తరఅంటేను. ఈవదంతి వూళ్ళో వ్యాపించడంతోనే వూరివాండరికీ పైప్రాణాలు పైకిపోయాయి. డబ్బులేనివాళ్ళకి ఏవిచారంలేదూ, డబ్బున్నవాళ్ళు తమ డబ్బుదాచుకోవడముకు అనేక ప్రయత్నాలుచేశారు గాదెల కింద దాచుకునేవాళ్ళు కొందరు, గాదెల్లోదాచుకునే వారుకొందరూ, తోటల్లోనూ దొడ్లల్లోనూ దాచుకునేవాళ్ళు కొందరూ, నూతుల్లో దాచుకునేవారు కొందరూ ఇలాగా అనేకవిధాలుగా ప్రజలు తమధనం దాచుకోవడం మొదలుపెట్టేరు.

మా ముత్తాతగారుకూడా తమడబ్బు ఎక్కడో దాచేరుట, ఎక్కడదాచేరో ఎవరికీ తెలియదు. దాచినచోటు ఆయన ఏకారణంచేతనో ఎవరికీనూ చెప్పలేదు.

తరువాత రాఘవరాజుగత్తర ఆవూళ్ళోజరిగిందిట. కొంపలు తగలబెట్టడం, ఇళ్ళల్లో మిగిలినసొమ్ము దోచుకోవడం ఇత్యాది జరుగవలసిన లాంఛనాలు జరిగేయి

అసలు చెప్పతలచుకున్న విషయం సరిది ఏమిటో చెప్పుతున్నాను. ఒకనాడు వేసవికాలంలో పుస్తకాల పెట్టె దగ్గిరపెట్టుకున్నాను పుస్తకాలుతిరగవెయ్యడం మొదలు పెట్టాను. కొన్ని తాటాకుపుస్తకాలు, కొన్ని కాకితాలపుస్తకాలు. కొన్ని భూర్జపత్రిపుస్తకాలు. ఒక కాకితాలపుస్తకంతీసి పైనిమట్టిసగుడ్డ విప్పేను ఇటూ అటూ కర్రపలకలు పెట్టి మధ్యను కాకితాలు పెట్టివున్నవి. ఒక కాకితం తరువాత ఒక కాకితం తిరగవేశాను. ఒక్కముక్క అర్థంకావడం లేదు. అంతా తెనుగులిపి. కాని అదిచదవడం అన్నా నాకుకష్టమనిపించింది. అది ఇలాతిరగవేస్తూంటే మధ్యను ఒకభూర్జపత్రం అవుపించింది. పత్రిముచేతితో పట్టుకొని దానిలో ఏమిరాసివున్నదో చదవవలెననుకొన్నాను. లిపి తెలుగే. భా

ష సంస్కృతం కాదు, తెనుగు కాదు. ఇటూ అటూ తిప్పేను.

వెనుక వేపున 'నిధికిదారి' అనివున్నది. నిధి అనిచదవడంతోనే నాకు మా ముత్తాతగారు దాచిన ధనం జ్ఞాపకం వచ్చింది.

ఈపత్రం నిధికినిజముగా దారిచూపిస్తుంది కాబోలు అనుకున్నాను. అనుకోవడం కొంతసేపటికి గట్టి నమ్మకములోకి దిగింది. అభావమేమిటో తెలుసుకొందామనీ, దానిలో కిటుకు తీద్దామనీ దృఢ సంకల్పం చేసుకున్నాను.

అయితే యిది రహస్యంగా వుంచవలసిన విషయం నలుగురినీ అడిగి ఎలాగ వెల్లడి చెయ్యగలను అని అనుకున్నాను. భూర్జపత్రం పైకితీసి పుస్తకం కట్టిపెట్టి, పెట్టెలోపెట్టి అంతాసర్ది అంగవస్త్రం బుజంమీద వేసుకొని భూర్జ పత్రం పట్టుకొని వూరికి కొంచెం దూరంలోవున్న దేవుడుగుళ్ళోకి వెళ్ళాను. అక్కడ ఏమి చెయ్యవలెనో ఆలోచించవలెనని వూహ.

దేవాలయానికి వెళ్ళి పత్రం తీసి చూసిచూసి ఎంతో ఆలోచించాను. ఏమీ పాలుపోయింది కాదు. దేవునికి వెయ్యికొబ్బరికాయ కొట్టిస్తానన్నాను. లక్ష వత్తులదీపారాధన చేయిస్తానన్నాను దాల్లో కిటుకుదొరికి నిధిదొరికితేను. ఊహు. ఏమీతోచిందిగాదు. ఇంక యింటికిలేచి పోదామని అనుకుంటూంటే ఒక మంచి వూహ స్ఫురించింది. విశాఖపట్టణంలో చాలా పేరుప్రతిష్ఠలు సంపాదించి కుశాగ్రబుద్ధి గలవాడని తెలుగు దేశంలో పేరుపొందిన "విశ్వనాథం" గారిని అడిగితే సర్వమూ విశదము కావచ్చునని తోచింది. అయితే డబ్బుతో కూడిన వ్యవహారంగదా ఆయనతో ఎలాచెప్పడం అనుకొన్నాను.

విశ్వనాథంగారు పరధనము తృణప్రాయంగా చూసేవారని యిదివరలో పూర్ణచంద్రుని విషయంలో ఆయన పనిచేసినప్పుడు లోకానికి తెలిసింది. అంతేకాకుండా ఆయన చాలా డబ్బుకలవాడు కదా! అని సమాధానం చెప్పుకొని ఆరాత్రే బయలుదేరి విశాఖపట్టణం వెళ్ళాను.

౨

పడక కుర్చీలో పండుకొని నవలచదువుతున్నాడు విశ్వనాథం. నారాయణదాసు పక్కకుర్చీలో పడుకుని కునికిపాట్లు పడుతున్నాడు. నడవలో నిలబడి 'విశ్వనాథంగారూ' అని కేకవేశాను. దాసు ఉలికిపడి లేచేడు, విశ్వనాథం 'దయచెయ్యండి' అనిఅన్నాడు, నేను గదిలోప్రవేశించి కుర్చీమీదకూర్చున్నాను.

"తమరు దయచేసిన కారణం—"

"చిత్తం! మాది పిఠాపురం కాపురమండి. మాయింటిపేరు పూలపల్లి వారు. నా పేరు నారాయణంటారు, అన్నాను.

"ఓహో! పూలపల్లి నారాయణగారంటేమీరేనా. మీపేరు ఈమధ్యను విన్నాను. జ్ఞాపకంవుందా దాసు?" అన్నాడు విశ్వనాథము,

"జ్ఞాపకం లేకేమి. నిన్ననేకాదూ

"మనకు ఆసంగతి తెలుస్తే," అన్నాడు బాసు.

భూర్జపత్రం సంగతి నిన్ననే వీళ్లకి ఎలా తెలిసింది చెప్మా, ఆవులిస్తే పేగులు లెక్క పెట్టే వాళ్ళనలెవున్నారే వీళ్ళు అనుకున్నాను.

"తమరు గొప్పవారు, నాపేరునిన్న నువినడం—

ఏసందర్భాన్ని—"అనిఏమో అనబోతూండగా విశ్వనాధం, "అది వేరేసంగతి లెండి అన్నాడు.

"అలాగ కాదండి, తమరు ఏసందర్భాన్న అనబోతూన్నాను, మళ్ళీ—"

"సందర్భాలూ ఏమిటికావాలా ? అదిధనవిషయం" అన్నాడు విశ్వనాధం. నా గుండెల్లో రాయిపడింది. అన్నాను గదా—"

"బీదవాడిని, ధనవిషయంలో నాపేరు వినడం ఎలాతటస్థించిందో తమకు"

"అయితే పూర్తిగా చెప్పమన్నారా! మీవూళ్ళో గానుగ వారున్నారు"

"చిత్తం. గానుగరంగయ్యగారండి"

"ఆయనకు ఒకకూతురున్నదట కాదూ. స్ఫురద్రూపిట"

"చిత్తం"

"వారుచాలా బీదవారట కాదూ"

"చిత్తం"

"పిల్లకు మంచి సంబంధం చేసి తన్మూలమున తాముకూడా లాభము పొందివృద్ధి పొందవలెనని వూహించినారట కాదూ?"

"చిత్తం. అలాగే అనుకుంటున్నారండి"

"చూడండి! నారాయణగారూ! నాప్రశ్నలకు మీరు యథార్థముగా ప్రత్యుత్తరము చెప్పితే నాకుచాలా సంతోషంగా వుంటుంది. మీకార్యంకూడా చప్పున తేలుస్తాను"

"చిత్తం. తమయిష్టప్రకారం చెయ్యడానికి సంకల్పించుకున్నాను" అని అనక తీరిందికాదు. మరి "ఈమధ్యను ఆఅమ్మాయికి కాకినాడనుంచి సంబంధం వచ్చిందికాదూ?"

"చిత్తం. కాకినాడలో తవ్వల శేషశాస్త్రిగారుచాలాధనవంతులని ప్రతీతి. ఆయనకు మొదటిభార్య జారిపోయిందిట. ద్వితీయంకోసం ప్రయత్నంచెయ్యడంలో యీసంబంధం కూడా చూచినారుట."

"సరే! ఆసంబంధం పొసగలేదట. కారణం ఏమో?"

"చిత్తం! తమతో నిజంమనవి చేస్తాను. ఆపిల్లకుకొంచెం కళ్ళుజబ్బని ఎవరో వదంతి పుట్టించారు. ఆకారణంచేత సంబంధం తిరిగి పోతుందని చెప్పుకున్నారు."

"నిజంగా ఆఅమ్మాయికికళ్లుజబ్బా?"

"రామరామా! లేదండి. వట్టికల్లవార్తపుట్టించేరు. పిల్ల తామ్రాతీగలా వుంటుందండీ నేనెరుగుదును."

"నారాయణగారూ, నాకేసి సరిగ్గా చూడండి మీరేకాదూ ఆ వదంతి పుట్టిస్తే?"

నానోటివెంట మాటవచ్చిందికాదు. పుట్టించిన మాటనిజమేకాని పెద్దమనిషి. దగ్గిరఎలాగవొప్పుకోవడం ?

"నిజం చెప్పండి. దానివల్ల మీకుఅపకారం కలగదు, నేను వాగ్దత్తము చేస్తాను. చెప్పకపోతిరా మీ కార్యం నేను చూడలేను. మీరు సెలవు పుచ్చుకోవచ్చును." ఇంతమట్టుకువచ్చేక యింక సెలవు పుచ్చుకోవడం ఎలాగ ఏమైనా సరేఅని చెప్పడం మొదలుపెట్టాను.

" చిత్తం తమవద్ద తప్పవప్పుకోక తప్పదు. నేనుబీదవాణ్నే. తవ్వాల శేషశాస్త్రిగారి సంబంధం తమ కూతురుకు తెచ్చిపెట్టితే రెండువందల రూపాయలు నాకుబహుమతీ యిస్తానని గొల్లప్రోలులో నూకల వెంకయ్యగారు నాకాళ్ళావేళ్ళాబడ్డారు. అప్పుడు ఈపనికి పూనుకున్నాను నేను."

" " శేషశాస్త్రిగారు వెంకయ్యగారి కూతుర్ని చేసుకున్నారా?"

" చిత్తం. పిల్లసలక్షణంగా వుంటుందండి. వెంకయ్యగారికి భూవసతికూడా చాలావుందండి. ఆకారణం చేత వెంకయ్యగారి కూతుర్నే ఆయన చేసుకున్నారు"

" మీరు ఇలాగ కుట్ర చెయ్యడం మూలాన్ని గానుగ రంగయ్యగారి కూతురికి తగినసంబంధంములు రావడం లేదనీ, వచ్చినసంబంధములు తిరిగి పోతున్నవనీ ఆశ్చర్యిస్తాడు ఈవూరు వచ్చి నిన్న మొరపెట్టుకున్నాడు పాపం. దానికి ఏమిశాస్త్రి?"

" తమరేదేమిశాస్త్రి చెప్పితే దానికి వప్పుకుంటున్నాను "

" సరే, తమకార్యం సెలవియ్యండి" అప్పుడు నేను సందేహంతో దాసుగారి కేసిచూశాను. విశ్వనాథం గ్రహించి "దాసువున్నాడని మీరు సందేహించకండి. అతడు మనవాడే" అన్నాడు.

అప్పుడు నేను భూర్జపత్రంతీసి విశ్వనాథంగారి చేతులో పెట్టి దానిపూర్వోత్తరములు చెప్పేను. విశ్వనాథంచాలాసేపు చేతులో వుంచుకొని నిదానించి చూచిఆపత్రం దాసుచేతిలో పెట్టేడు.

"దాసూ, విన్నావుటోయి, ఈభాష తెలిస్తే రెండు లక్షలరూపాయిల సంసారి అవుతాడు ఈబ్రాహ్మడు. ఏం భాష అంటావు ఇది?" దాసు మాట్లాడలేదు.

"ఇది యే భాషా కాదు. తెనుగు" అనివిశ్వనాథం అన్నాడు

"తెనుగా" అని దాసూ నేనూ ఒక్కమారన్నాము.

"ఏదీ చదువు చూతాము" అన్నాడు విశ్వనాథం. దాసుదానిలో వున్నది యిలా చదివేడు.

పాదికష్టిచి। వూమ్కుజా। కొండుచుమ్మరు వాంతి। పాహిబెత్తు। కెబత। చొందజువసో।పా పిహిజ్ఞవం। చుదిహైకుమ। కిందుజడాసు। సోవు మ। మళి॥

"ఇది తెనుగంటావు ఏమిటి?" అన్నాడు దాసు.

"కారణం చెప్ప మన్నావా, చూశావా!

నారాయణగారి నుత్తాతకు ఏం భాషలు వచ్చివుంటవి — తెనుగు, సంస్కృతం, వస్తే హిందీ భాషా. ఇది సంస్కృతంకాదు. మనుమూ దేశాచారాన్ని అనుసరించి హిందీచదువుతున్నాము గదా, ఇది ఆభాషలా లేదని నేను చె

ప్పవసరంలేదు. ఇకమిగిలింది తెనుగు."

"అర్థం మన్నాలేని ఈవింత శబ్దాలను తెనుగంటావు నాకుచాలా వింతగావున్నది"

"అయితే యింకో కారణం చెప్పనా ఆయన ముత్తాతగారు ఇది రాయడం తమ వారికి వినియోగపడుతుందనే గదా. అలాంటి విషయంలో ఈపత్రం మీద తమ మాతృభాష రాసుకోక కోయభాష రాయరుగదా!"

"ఇది కోయభాషను మించినట్లు తోస్తుంది," అని దాసన్నాడు.

"అలా అనకు. ఇది తెనుగనే నా నమ్మకం. కొంచెం అక్షరాలు ఇటూ అటూ కద్దాయి. అయినా చూద్దాము కాదూ. అయితే నారాయణగారూ!"

"చిత్తం" అన్నాను.

"మీ వుద్దేశం యేమిటి"

"నావుద్దేశానికేముందండి, తమరు ఈ వుపకారం చేసిపెడితే తమ మేలు ఎప్పుడూ మరవను. తరతరాలా చెప్పుకుంటాము. ఎప్పుడూ తమ ఆజ్ఞకు బద్ధుడనై వుంటాను."

"ఉంటారా? మాటతప్పరుకదా"

"ఎంతమాట సెలవిచ్చేరు!"

"అయితే వినండి. ఈనిధి మీకు దక్కేటందుకు దీని కీటుకు మీకు దొరకాలి. అదే కదా మీరు నన్ను చూడ్డానికి వచ్చిన వుద్దేశం. ఈకీటుకు నేను మీకిస్తాను. మీరు గానుగ రంగయ్యగారి కుమార్తెను వివాహము చేసుకోవాలి!"

"సందేహిస్తారేమి. పిల్ల బాగుండదనా. తాంబ్రాళీగలాక్షంటుందని మీరే సెలవిచ్చేరు. ఆమెకు కళ్ళజబ్బు లేదని మీరే చెప్పేరు. ఇంక వంశం మంచిది కాదనా? అదేమిటో చెప్పండిమరి."

"సాంప్రదాయ సిద్ధమైన వంశమేనండి" అన్నాను

"అయితే సగోత్రం కాదుకద"

"కాదండి"

"అయితే వప్పుకోండి"

"చిత్తం, తమసెలవు ప్రకారం జరిగిస్తాను. కాని కీటుకుమాట—"

"ఆవిషయంలో మిమ్మ మోసంచేస్తానా? మీకు నిధి దొరికినతర్వాతనే తాంబూలాలు పుచ్చుకోవడం. పాపం రంగయ్యగారు సంబంధందొరకక వూరూరూ తిరిగియెన్నోపాట్లుపడుతున్నారు మీమూలాన"

'చిత్తం. మీ యిష్టానుసారమే—"

"ఇంకోవిషయం. రంగయ్యగారిది బీదకుటుంబంఅని మీరేచెప్పేరు. ఈపెండ్లి జరిగిన మీదట వారికుటుంబం నిలబెట్టడం భారంకూడా మీమీదేపెట్టవలెనని నాకువుంది!"

"అభ్యంతరం యేమిటండి!"

"అయితే రేపుతమరు దయచెయ్యండి. ఈకీటుకు చెప్తాను, వివాహవిషయంలోకూడా తక్కినసంగతులు మాట్లాడుదాము"

"చిత్తం" అనినేను భూర్జపత్రపునకలువారికిచ్చి పత్రంపట్టుకుని బసకు వచ్చాను.

మరునాడు భోజనముచేసి నేనువిశ్వనాథంగారిఇంటికి వెళ్ళేను. దాసుగారూ

విశ్వనాథంగారూ ఏమో మాట్లాడుకుంటున్నారు. నన్ను ఒకకుర్చీమీద కూర్చోమని వారిసంభాషణ సాగించేరు.

“రాత్రి అంతటీతాగి తేమరి నిద్ర ఎలా వస్తుంది?”

“టీ తాగడంవల్ల కాదోయి. దీనితస్సాగొయ్యా ఈకాగితం ప్రాణాలుతీసింది!”

“అపరాధాలు పరిశోధించడంకన్నా కష్టం అనిపించిందా?”

“సరీ, దానంతకష్టం యిదీ పెట్టింది.”

“కిటుకు దొరికిందా?”

“మనచేతులో బడ్డాక దొరక్క పోతుందా?”

అప్పుడు నాకుఅపరిమితానందం కలిగింది. లకొాధికారిని అయ్యేననుకున్నాను సత్రాలుకట్టించాలను కున్నాను. విశ్వనాథం గారికి ఏవేవో చెయ్యాలనుకున్నాను, జ్ఞాపకంలేదు.

“ఏమి టాకిటుకు?”

“ పూరికేచెప్పిస్తే ఏముంది దాని పసపోతుంది. ఇలా దగ్గరగా రా. దాని వ్యవహారం చెపుతాను”

దాసు కుర్చీదగ్గరకు లాగుకున్నాడు. ఇద్దరూ కాగితంచూస్తున్నారు ఉండబట్టలేక నేనుభూర్జపత్రం తీసి చూడడం మొదలుపెట్టేరు”

“మొదటినుంచీ చెప్పలేదూ, ఇది తెలుగని.”

“తెలుగేనా చివరికి, ఏలాటీసేపు కిటుకు మరిచెప్పూ. నారాయణ గారు ఆదుర్దాపడుతున్నారు పాపం.”

“అయితే వినుమరి. యీ కాగితం ‘నిధికిదారి’ చూపుతుందని భూర్జపత్రం పైకరాసిన మాటలనుబట్టి తెలుస్తూన్నదికదా. అదిజ్ఞాపకం వుంచుకో. ఈ వ్రాతపరిశీలించి చూస్తే ఎక్కడకక్కడకు పదములు విభజించి వున్నాయి. మొత్తంమీదపదకొండు పదాలున్నట్లు తేలుతుంది. అందులోనిధిఅనే పదంవుంటుందనినీకుతోస్తుందా?”

“వుండవచ్చును.”

“వుండవచ్చును కాదు. వుందిచూడు. ఇందులో రెండక్షరముల పదము చివరవుంది. అది ‘మిభి.’ ఇది నిధి కావచ్చును. మొదట అను నాసికము ఇత్వముతోకూడి వుండడమువల్లా రెండనది యిత్వముతోకూడిన వత్తు అక్షరము అవుటవల్లాను. ఈపదాన్నిబట్టి మనము ఇంకొకటి గ్రహించవచ్చును. ఈచీటిలో హల్లులే మార్చినారు కాని అచ్చులేమీ మార్చలేదని.”

“కావచ్చును.”

‘మిభి’ ఇంతమట్టుకు ‘నిధి’ గా గ్రహించాము. రెండక్షరములుమనకు తెలిసినవి కాబట్టి మనము ‘మ’ వున్నచోట ‘న’ పెట్టి ‘భ’ వున్నచోట ‘ధ’ పెట్టి చీటి మళ్ళీ రాయవచ్చును.

“రాస్తే లాభం ఏమిటి”

“చెబుతావిను. కొంతమట్టుకు మనకు తెలిసింది కాబట్టి మూడక్షరాల పదం తీసుకుందాము. అది సోపుమ.” ‘మ’ అనగా ‘న’ అనిమనకు తెలుసును. అప్పుడు “సోపుమ” అనేది “సోపున” అవుతుంది. ‘సోపు’ ఏఅక్షరాలయి వుంటాయి అని ఆలోచించాలి. ‘సోపున నిధి’ అంటే అర్థంలేదు. చా

లా స్లేపు ఆలోచించినమీదట 'సోపుమ' అనేది 'లోతున' అని నాకు తట్టింది. ఎందుచేతనంటే, డబ్బుపాతిన వాళ్లు ఇంతలోతులోనా తేమని చెబితేకాని లాభంలేదు చూడూ."

'లోతున' ఎందుకు కావాలి, 'పైపున' కాకూడదూ?"

"అచ్చులు మారలేదన్న సంగతి నివు మరిచినావు."

"సరే"

"ఇంతమట్టుకు కొంత కీటుకు దొరికింది.

స=ల; ప=త; మ=న; భ=ధ అనీ మనకు తెలిసింది. తరవాత ఇంకో సంగతి. తెలుగులో చాలామార్లు రాతలో వచ్చే అక్షరాలు ఏమైవుంటాయి అని ప్రశ్న వేసుకున్నాను. న, వ, ర, త, గ, అని తోచింది. చీటిలో చాలామార్లు వచ్చిన అక్షరాలు ఏమిటి. ఇదిగో వ—ఆరుసార్లు; ప, హా, మ—ఐదుసార్లూ ద, జ,త—నాలుగుమార్లూవచ్చేయి. చాలామార్లు వచ్చిన ఈఅక్షరాల బదులు పైనజెప్పిన అక్షరాలు ఇదికాదని అదీ, అదికాదని ఇదీ, పెట్టితంటాలుపడి మొత్తంమీద 'వ' అంటే 'ర' అనీ, పహామలుతవనలనీగ్రహించాను. మొత్తంమీద మనకు ఈఅక్షరాలు తెలిసేయి. స=ల; ప=త; మ=న; భ=ధ; వ=ర; హా=వ. ఈ తెలిసిన అక్షరాలు పెట్టి మళ్ళీ రాసిచూద్దాం ఎలావుంటుందో.

తాలికత్తిచి। తూర్కు౼జా। వుందుచున్నరువంతి। రావిపెత్తు। కేబత।చొందజావలో।రాతివి ప్రజవం। చుదిపైకున। రెందుజడాలు। లోతున। నిధి.

"ఇప్పుడుకొంచెం దీనికి తెలుగువాలకం వస్తోంది. కొన్నిముక్కలు నేనుకూడా వూహించి చెప్పగలను సుమా."

"ఆ. అదీ. దారిలో పడుతున్నావు. ఏదీ నీకు స్ఫురించింది చెప్పు."

"'తూర్కు౼జా వుందుచున్నరువంతి' అనేది 'తూర్పుగా వుంచుకున్నటువంటి' కాకూడదా?"

"అదే, సందేహంలేదుకాని ఆఖరి అక్షరం 'త'—'ట' అయింది కాబట్టి ర, టా కాదు. అదివుంచుకున్నటువంటి కావాలి, తరవాత,"

"రెందుజడాల—రెండుగజాల కావచ్చుననుకుంటా."

"సరి మరిఇప్పుడు తెలిసిన అక్షరాలన్నీ పట్టీవేసి యిదియెలారాసేరో ఆకిటుకుకని పెట్టు. దాసు పట్టీవేసినాడు" కాని తనకు స్ఫురించలేదన్నాడు.

"చూశావూ కవర్గ అక్షరాలుండవలసినచోట ఏఅక్షరాలు వచ్చేయి?

'చవర్గ అక్షరాలువచ్చినట్టు తోస్తుంది.'

'చవర్గ వుండవలసిన చోటో?'

'టవర్గ. సరి, తెలిసింది! కవర్గబదులు చవర్గ; చవర్గబదులు టవర్గ; టవర్గబదులు తవర్గ; తవర్గబదులు పవర్గ; పవర్గబదులు కవర్గ ఇది తెలుస్తూనేవుంది.'

"మిగిలిన అక్షరాలమాటో?"

"యరలవలబదులు శషసహాలు; శషసహాలబదులు యరలవలూను."

"సరేనీకు అంతా తెలిసింది"

"ఈకీటుకునీవు ఎలాపట్టేవోయి?"

"నారాయణగారి ముత్తాత వ్యాకరణ శాస్త్రవేత్త అనేసంగతి మరచిపోయావునువ్వు, అంచేత నేమనని యిలా బాధపెట్టేరు! కాసీగాని అదంతా తెలుగులో రాసి శాస్త్రుల్లుగారికి చెప్పు."

"చెప్పడానికేముంది. ఇదిగో"

"తాడిపత్రికి తూర్పుగా వుండుకున్న పుష్కలంటి రావిచెట్టు యెదుట కొండగుహలో రావిక్రిందనే కుడివైపున రెండు గజాలలోతుననిధి."

నేను కాకితంమీద అంతా రాసుకున్నాను.

"ఏమండి నారాయణగారూ! మీకు సంతృప్తిగావుందా?"

"సరిసరి ఎంతమాట సెలవిచ్చినారూ. ఎప్పటికైనా మీ ఋణం తీర్చుకోగలనా అని ఆలోచిస్తున్నాను"

3

దాసుగారూ నేనూ కలిసి తిరుగు బండిలో పిఠాపురం వచ్చి ఆ రాత్రే బయలుదేరి తాడిపత్రికి వెళ్ళేము. కొంచెం కొంచెం గుడ్డివెన్నెలగా వుంది. రావిచెట్టు కనుక్కున్నాము. దానికి ఎదురుగా కొండ ఒక మైలు దూరంలో వున్నది. అక్కడకు వెళ్ళేము. గుహ కనుక్కోవడం మాత్రం చాలా కష్టమయింది.

దాసుగారు కుడివైపునవున్న కొండగుహ బాగా పరీక్షించినారు. అక్కడ గోడకు దాసిపెట్టుకొని ఒకచాపరాయి వున్నది. అది యివతలకులాగి నన్ను అక్కడ తవ్వమన్నారు. తవ్వేను. తవ్వగాతవ్వగా ఒకరాగిచెంబు కనిపించింది. ఇంకా కాగజంలో తుతిక్వీ చెయ్యిపెట్టి చూశాను, ఇంకేమీ అగుపించలేదు. రాగిచెంబుమీద మూత తాపడంచేసివున్నది. విశాఖపట్టణం వెళ్ళి విశ్వనాథంగారి ఎదుట మూతతీయించవచ్చునని దాసు చెప్పితే మాంభాగన్నాను.

మూతతీయించిచూస్తే దాన్లో బంగారు కణికలు, ముత్యాలహారాలూ, వజ్రాలపతకాలు, కెంపుల పతకాలూ, కానవచ్చినవి. మొత్తంమీద రెండులక్షలఖరీదువుంటుందని మదింపువేశారు.

మొదట నాకిష్టంలేక పోయినా రంగయ్య మామగారికుమార్తె మంచి పనిమంతురాలు కావడం వల్లా, సలక్షణమైనపిల్ల కావడంవల్లా, మంచి గుణాలు కలది (నే చెప్పుకోకూడదు) కావడం వల్లా నాకునా అదృష్టంవల్ల సమకూడిందని తరవాత అనుకోక తప్పిందికాదు. నాభార్యా నేనూ సిరిసంపదలతో తులతూగుతూవున్నాము. అన్నట్టు చెప్పడం మరచిపోయేను. విశ్వనాథంగారికి ఒక తృణంయిద్దామని సంకల్పంచేసుకొని ఆ సంగతి వారితో చెప్పేను ససేమిరా ఆమాటవారు విన్నారుకారు. దాసు నా ప్రాణస్నేహితుడైనాడు.

మావూళ్ళో దేవుడికి వెయ్యి కొబ్బరికాయలు కొట్టించాను సుమండి! లక్షవత్తుల దీపారాధనకూడా చేయించాను ఏమనుకున్నారో! సత్యంమాట ఆలోచిస్తున్నాను.

పూలపిల్లి నారాయణ

...పు నారాయణశాస్త్రి

# 'సాహితి' చందాదారులకు

౧. దీనితో ఆఱుసంచికలు సమాప్తమయినవి, మొదటి సంపుటము పూర్తిఅయినది. ఇందులో ఒక నవల, ఆఱువ్యాసములు, పందొమ్మిది కథలు, రమారమి ౫౦ పద్యములును ఇచ్చినాము. విడిగా అచ్చువేసినయెడల, నవల ఖరీదు ౦.౧౨.౦. వ్యాసములు ౦.౮.౦. కథలు ౧.౦.౦. పద్యములు ౦.౧౨.౦. వెరసి రూ 3.౦.౦. ఖరీదు అగును. పోస్టేజి మేమే భరించి, చందాదారులకు ఇవియన్నియు రూ.౧.౮.౦ కే ఇచ్చినాము!

## రెండవ సంవత్సరము

౨. రెండవ సంవత్సరముకూడా 'సాహితి' ఆఱుసంచికలుగా ప్రకటింతుము. ఇదివరకుకంటె కాకితము ఖరీదు రమారమి రెట్టింపు అయినను, అచ్చు ఖరీదు ఒకటిన్నరరెట్లు హెచ్చినను, చందా యెక్కువచేయక రూపాయిన్నరగానే ఉంచినాము.

## విశేషము

3. రెండవ సంవత్సరము 'సాహితి'లో అపరాధపరిశోధకకథలు (Detec-tive stories) దేశచరిత్రాత్మక కథలు (Historical tales) సాంఘిక కథలు (Social stories) ఉండును. రసమువర్షించు పద్యములు, ఉద్బోధకములయిన వ్యాసములు మృదుమధురశైలిలో నుండును. ఎవరు ఎందులో ప్రవీణులో వారు ఆవిషయము ఇందులో వ్రాయుచుందురు.

౪. క్రొత్త పోస్టల్‌రూల్సుప్రకారము ప్రతి వీ. పి. ప్యాకెట్టు రిజిష్టరు చేయవలెను; పైన మనిఆర్డరు కమీషన్ తప్పదు. మేము మీపేర వీ. పి. పంపేయెడల రిజిష్టరుఖర్చు రెండణాలు, కమీషన్ అణా, వెరసి మూడణాలుఖర్చు మీకు తగులును. చందా రూపాయిన్నర మీరు మాపేర మనిఆర్డరుద్వారా పంపినపక్షమున మీకు అణాఖర్చుతో సరిపోవును.

## సాహితీసమితిలో

౫. అందరును పెద్దమనుష్యులు; కవులు, చిత్రకారులు, విద్వాంసులును సభ్యులు. చందాలు తీసికొని ప్రజలను మోసగించు వర్తకసంఘములవంటిది కాదు ఈ సమితి. కాబట్టి, ప్రజలు నిర్భయముగా చందాడబ్బు పంపవచ్చును.

## గమనింపుడు

౬. ౧౯౨౧, జనవరి, ౧౦ తారీఖు లోపుగా మాకు చందాడబ్బు చేరనిపక్షమున పాత చందాదారులకు రెండవసంవత్సరపు మొదటిసంచిక వీ. పి. ద్వారా పంపుదుము.

చిరునామా: శ్రీ. వీరరాఘవస్వామి గారు, కోశాధ్యక్షుడు,

# సాహితీసమితి, తెనాలి

చంద్రికా ముద్రాశాల గుంటూరు.